యింకను అంతదూరము చూపుచునే యుండును. అట్లు ఎంత దూరము మనము పోగలమో, అంతవరకు అది దారి చూపుచు యుండును. అట్లే మనకు తెలుపు తెలివియు నుండును. అది తెలిపినట్లు నడచిన యెడల యింకను తెలుపును. నడచు వృత్తి ఎపుడు లే పోవునో తెలుపు తెలివియు అపుడు లేకపోవును. కాని యీ తెలుపు తెలివి ఆత్మశక్తి గలవారి యొద్దనే యుండు నన్న సంగతి మరువరాదు.

# మనసు, మాట, చేత

ఆత శక్తి కలవారే మనసు, మాట, చేత ఒకటిగా నడువ గలుగుదురు. బంగారమునకెంత విలువ యుండునో, వారి మాటకును అంత విలువ యుండును. వారి నోరు య మగును గాని చౌక కాదు. మనుజునకు మానము నదెంత యభిమాన ముండునో, వారికిని వారి మాటయందంత అభిమాన ముండును. వారట్లు మనసు, మాట, చేత ఒకటిగా నడువగా నడువగా, వారి మనోవృత్తులు శూన్యములై మనసు మాణిక్యము వంటి దగును. సంపూర్ణమైన అభిమాన కలవారు ఎట్లు తమప్రా ములైనను వదలి మానమునే రక్షిం కొందురో, అట్లే మనోవాక్కాయ శుద్ధికలవారు అసత్యము మొదలగు దురభ్యా ములకు లోబడరు.

జన ఋణానుబంధము గాన, అట్టి ఋణబంధము తీ వలయునంచు, మనసు, మాట, చేత ఒకటిగా నడచునట్టి ఆత్మ

శక్తి సంపన్నుల సాంగత్యముచేసి ఆ శక్తిని సంపాదించ వలయును. మంచిదగు మానవ జన లోనే అట్టి శక్తిని సంపాదించి ఋణము తీర్చ లేకపోతిమా, ఎట్టి కర్మ సంపాదించు కొందుమో యోచించి చూడుడు. 'మనసు, మాట, చేత ఒకటిగా నడచుటచే భవ రోగమును మాన్పు మందు' అని గుర్తెరింగి అట్లుగా నడిపించే ఆత్మశక్తిని సంపాదించవలయును.

మనసు, మాట, చేత ఒకటిగా నడిచే ధనమును యిది వరకు సంపాదించి యుంటివా, "ఇది కాదు, ఇదికాదు" అనుచు ఒక్కొక్క గుణమే నిన్ను విడిచి పోవును. నీ నడక సులభ మగును. తుదకన్ని ఋణములు తీరును. లేని యెడల యిప్పుడైనను సంపాదించుకొనుము. దాని సాయముతో (దానిని సంపాదించినచో) మరియొక జన్మయందు సులభముగా నడచెదవు.

మనలో లోకమున్నది. మనలోనున్న లోకమే వెలుపల నున్నది. దేవుడు కావలయునంటే మనలోని లోకము వెలుపలకు రావలయును. ఫలములు చెట్లునెట్లు విడిచి పోవునో, అట్లే మనసు, మాట, చేత ఒకటిగా నడచునట్టి ఆత్మశక్తి సం న్నులను లోక గుణములు ఒక్కొక్కటే విడిచిపోవును.

మనసులో ఒకటి, మాట వేరొకటి, డ రొటిగా నుండుటయు, ప్రేమ, మరా ద గౌ యిచ్ఛ అను నవియు మనోవాక్కాయ శుద్ధి భిన్నములై బ గములగును. మనో వాక్కాయము లొకటికాక భిన్నములై మ ము భిన్నము కలవారమని వేరు చెప్పవలయునా? అవియే మన మరుజన్మకు విత్తనములు.

# నీతి సత్యములు

ఆత్మ శక్తి సంపన్నులు మాట మాటకు సత మునే పలుకుదురు. వా ది ఒకమాట సత్యము, ఒకమాట యసత్యము కాదు. అట్లు అన్నమాట ప్రకారము తప్పక నడచునట్టి ఆత్మ శ గలవా ముక్తికాం తరుముకొ వచ్చును. వారి చే శక్యా గాని చిరసౌఖ్యము. వారట్లు ధువగా నడు గా వా యజ్ఞా ము సిగ్గు డి మాయ మాయమగును. తన్ను తె మాయ మాయమ ను. జగము సున్న యగును. అ ంకా ము నేను ర్పా చం ము రి పోవునే గా ర్తృత్వ మందును గా రాదు.

అసత , అధర ముల నడత మన ఋణమును పెంచును. నీతి సత్యముల నడత మనఋణమును తీర్చును. నీతి సత్యములే మనలను హద్దులోవుంచి నడుపునవి. ఆత్మశక్తి కల వారి యొద్దనే యిట్టి నీతి సత్యములుండును.

తాము వెలిగించుకొన్న దీపము మరియొకరికి వుపయోగ పడు తిగా, తామన్న మాట చొప్పున డచునట్టి ఆత్మ క్తి లవారు, వారుకడతేరగా, వా ద్వారా యితరులు సయితము డతేరవచ్చును.

ఒకసారి పరమాత్మను దర్శించి వారు దేవునిగురించి ఏ పనియు యరు. సత్యమొక్కటియ నడతురు. ఏమేని

కావలయునని తెచ్చుకొనుటంతయు ఒకటి కోరిన మరియొకటి సంభవించుటకు హేతువగునే గాని సరియైన త్రోవకాదు.

పాప పుణ్యములు రహితమయే వరకు జ్ఞానుల ఆత్మ శక్తి కలవారి) రక్షణకు సత్యమైన నడతయే మార్గము. వారట్లు సత్యము నడువగా నడువగా, అసత్య ప్రపంచము లే పోయి, తమవృత్తి నివృత్తి కాగా, ప్రపంచము వారిని విడచును.

విషయములన్నియు ఆటలోని బరుల వంటివి. జ్ఞానులు అని బరులను ఒకొకటిగా దాటి తీరుదురు. ఒక్క విషయము మిగి యున్నను వారికి లోకము మిగిలియుండును. ఒకొ టిగా అన్ని విషయములు దాటించునది నీతి సత్యముల నడతయె.

వేదమనగా యే దేశమునను లేదు. పరిశుద్ధాత్మ పలికి నట్లు అనగా మనసు, మాట, చేత ఒకటిగా నుండు ట్లు నడచుటే వే ము, జాగ్రత, నీతి, సత్యము అను వే వేదము. జన్మ రాహిత్యమునకు జప తప .. జులు వేదము కాదు. సత్యము, ము అని పలుకుట వేదము కాదు. స త్యమైన డ యే వె ము.

మనసు, శ రము కండలు కళ ళ కాగక యిన. తెలుసుకొందు ననుకొని నప్పటి పత ము (ఆత్మ తెలియదు. ము కు తానే తెలియు ు మనసు, శరీ ము, క ు పెళలాడి, రగి ఒకొ్క వి షయము తె యవచ్చును. బంతి యాడువారు బంతిని నే బడనివ్వక ఎట్లు ఎగురగొట్టుదుర ,

అట్లే సత్యముగా నడచినవారిని (జ్ఞానులను) పడిపోనీక, వెలుపలి ప్రకృతి తన ఋణము తీర్చుకొనుచూ, తనను తాకనివ్వక, తుదకు విడిచిపెట్టును.

చెట్టుయొక్క ఆకులు, ఫలములు లోపలనుండి వెలుపలకు వచ్చునే గాని, ఆ యాకులు, ఫలములు మరల చెట్టు లోనికి పోజాలవుగదా! ఇదియొక మానవ వృక్షము. ఈ మానవ వృక్షమునుండి వెలుపలి లోకమునకు ఎన్నెన్నియో లోకగుణములు బయటికి రావల యున్నవి. మనసు, మాట, చేత ఒకటిగా నడచునట్టి జ్ఞానులకు లోపలనున్న లోకము వేగముగా బయటికి వచ్చును. బయటికివచి న లోకము తిరిగి లోపలికి పోజాలదు.

"దేవుడు గుణ హితుడు" అను మాటను ఏమిచేసి మనము 'రామ, రామ' యనుచు కోరి లు కోరుట? అటుల కోరునెడల దేవుడు గుణరహితుడను మాటకు భిన్నము తెచ్చినవా మగుదుము. కావున అది సరికాదు. సత్యము పలుకు , పలి నట్లు నడచుటయే సరియైన మార్గము. ఈ మా ము ఆత్మశక్తి కలవారే నడువ గలుగుదురు. ఆ శక్తి నీల లే పోయిన అట్టిశక్తి కలవారు ఎచట వుందురో వెదుక వలయును. వెదకిన దొరుకుదురు. వారి యాత కు నీ జీవాత్మను అప్పు పెట్టుము, అనగా మొదట అన్న నీరు యిచ్చిన చాలును. అది కర్మయగును. ఆ కర్మయే నిన్ను నడపును. ర లాత్మతో నిలిచి యుండుటకు క- సూత్రమే కారణము, అ నదిని దాటించు నావవంటిది.

# అవస్థా త్రయము

తెలియనే తెలియనిది జాగ్రత్తలో షుప్తి. తెలిసి తెలిసినట్లు నడువనిది జాగ్ర లో స్వప్నము. తెలిసి తెలిసినట్లు నడచునది జాగ్రత్తలో జాగ్రత్త. జాగ్రత్తలో తె య నే తెలియనీయనిది సుషుప్తిలోని తీసుకొని పోవును (జీవాత్మస్థితి). జాగ్రత్తలో తెలిసి తెలిసి ట్లు నడువనీయనిది స ప్నములోనికి తీసుకొని పోవును (అం రాత్మ ). జాగ్ర లో తెలిసి తెలిసినట్లు నడుపునది జాగ్రత్తకు తీసుకొని పోవును (ఆత్మస్థితి). ఇదియే పరమాత్మ దాపునకు పోవు త్రోవను చూపును. ఈ మూడు జీవుని అవ లు. ఈ మూడు అవస్థలకును లోబడనివాడు ఐ కాతీతుడు.

# సాకారి-నిరాకారి పాట

దిన దినము పెరుగునే కారీ
దిన దినము తరుగునే రాకారీ
ముసుగులు వేయునే సాకారీ.
ముసుగులు తీయునే నిరాకారీ
లోకమునకు లోబడునే సాకారీ
లోకమును ఖండించునే నిరాకారీ

చిక్కులు పెట్టునే సాకారీ
చిక్కులు తీయునే నిరాకారీ
పాకులు పాకునే సాకారీ
పాకులు త్రుంచునే నిరాకారీ
పెంచుకుంటూ పోవునే సాకారీ
త్రుంచుకుంటూ పోవునే నిరాకా
దేని సుఖము దానికే సాకారీ
లేని సుఖము దానిదే నిరాకా
ఎక్కుచూ పోవునే సాకారీ
దిగుతూ వచ్చునే నిరాకారీ
దేనిది దానికే సాకారీ
కానిది కానిదే నిరా ●రీ
జన్మలు పెంచునే సాకారీ
జన్మలు త్రుంచునే నిరాకారీ
చదువులు సాకునే సాకారీ
చదువులు సున చుట్టునే నిరాకారీ
నిష్టలు చేయునే సాకా
నిష్టలు గుంట పెట్టునే నిరాకారీ
అనుగ్రహా మిచ్చునే సాకారీ
నిగ్రహించునే నిరాకారీ
వెలుపల నున్నలే సాకారీ
దాపట నున్నలే నిరాకారీ
పాటలు పాడునే సాకారీ
పాటలు సున్నలే నిరాకారీ

# శ్రీ

# చిన్నయ్య

# జీవిత

# సంగ్రహము

# శ్రీ చిన్నమ జీవితమండలి

## వృత్తిమార్పులు

1. దేవునిగూర్చి వుపదేశమునకు వెళ్ళు సమయమున అవన్నియు అసత్యము లనియు, *విధియైన సత ము, శాంతము, దయ, ధర్మము, ఓర్పు, జ్ఞానము, అపరి(గ ము, అహింస అను గుణములతో నడచుటే తనను తెలుపుమార్గమనియు అమ్మకు తెలిసెను, తనను తెలుపుమార్గమే పరమాత్మను తెలుపుమార్గమని దృఢపడెను. తనదోషము తనకు తెలియనిచో పరమాత్మ తెలియబడదని తెలిసెను (1911).

2. చింతకాయ మొదట గుల్ల, గుజ్జు, ంజ అంతయు ఒక్కటై యుండునట్లు చరాచర ప్రపంచములో అన్నియు తానై యుండును. చింతకాయ పండినపిదప గుల్ల, గుజ్జు, ంజ వేరై నట్లు, సచ్చిదానందమూర్తి (ప్రథమ పుత్రుడు) పుట్టి 2 వ దినము ఒక్కటియు నేను కాదను తెలివి తానై, తానువేరు, శరీరము వేరని తె సెను. తాను వేరైన డు శరీరముతో పనులుచేయు శక్తి లేకపోయెను. అన్నియు నేనను నపుడు యథాప్రకారం శ -తో పనులు చేసెను జూన్ 1911).

---

* విధియన అహంకార కర్తృత్వములు లేనిది. ఇది ఆత్మ స్వరూపు లనబడు వారియందే యుండును.

3. వెంకట్రామయ్య (ద్వితీయ పుత్రుడు)కు 8 మాసముల ప్రాయమున, అమ్మకు హఠాత్తుగా పరమాత్మ దర్శనమయ్యెను. ఆ సమయమున నామ రూపాత్మకమైన ప్రపంచము కనుపించక, మెఱుపు చందమున పరమాత్మ దర్శనమయినది. పరమాత్మను దర్శించినది భావమనియు, భావాతము పరమాత్మయనియు దృఢపడెను (1914).

4. (శ్రీ) రామమ్మ (పుత్రిక) జన్మించినపుడు అమ్మకు తండ్రిభావము వచ్చినది. ఆరుమాసముల తదుపరి వారిని తాక వచ్చినభర్తకు తల్లిగాకనపడ, భర్త తాకలేకపోయెను. (1916)

5. శ్రీ రామమ్మకు 1 సం॥ 6 నెలల వయసులో అందరి తల్లినికానట్లే యీ పిల్లలకుకూడ తల్లినికానని తెలిసెను. ధనేషణపోయి పనులుచేయుటకు చేయిరాక పోయెను. గడ్డి పోచ కూడ త్రుంచలేకపోయెను. 918

6. నీళ్ళమీద నడచుట ఎంతభయమో, భూమిమీద డచుటన అంత భయము కలిగెను. కాళ్ళకు శక్తిలేక నడువ ౼కపోయెను.

7. మాటకు పోటీగా మౌనము వచ్చెను (19 సెప్టెంబరు నుండి 1930 డిశంబరు వరకు. ఈ మౌనము సుమారు 12 సం॥లు. కాళ్ళకు నడచు శక్తి చ్చెను.

8. అన్నియిండ్లు తనవి కానట్లు ఒకయిల్లు యితము తనది కాదని తెలిసెను. ఇంటినుండి వెడలగొట్టబడెను. (19 8

9. ధనము తాక పా ణము గిలగిల కొట్టుకొనెను. (నల్లూరు పాలెం 1920)

10. అన్నము తిన జాలక ఫలహారములుచేసెను 1923 మే నుండి 1930 డిశంబరు వరకు

11. అభిమానము తానై శరీరమును స్త్రీ, పురుషులు చూడ వలనుగాక పగటివేళ కూడ చీకటిలో నుండెను. పగలు దీపపు వెలుగున కనబడుట; రాత్రు లందు బయటకు రా గలుగుట (1924 నుండి 1927 వరకు తుదకు 13 దినములు నీరసము వచ్చి అభిమానము పోయెను (23-11-1927).

12. నల్లూరు పాలెంలో 8 దినములు నీరసము వచ్చి వెంట్రుకలు అలంకారమని తెలిసెను. కొప్పుముడి విడిచి తిరుగుటకు వీలులేక వెంట్రుకలు తీయించెను (డిశంబరు 192 ).

13. మలవిసర్జనమునకై బయటకు వెళ్లినప్పు డొక సారి, "యీ అశుద్ధమును ఎవరికి పెట్టుదు వని లోని ఆత్మ ప్రశ్నింపగా గుండె ఝల్లుమని అశుద్ధమును పూడ్చి ట్ట నారంభించెను.

14. భర్తలు, మిత్రులు, శత్రువులు సమానమని తెలిసి అనగా చూచుటకు, మాట్లాడుటకు వె ట పక్షపాతమని తెలిసెను. వెళ్ళుటకు వీలుగాక మానెను (1 29).

15. అహింసతానై, అన్ని ప్రాణులయొక్క హింసయు తాననుభవించెను. హింసపడు ప్రాణులను తన ప్రాణముతో సమానముగా కాపాడెను (1929 నుండి).

16. మూడు మాసముల నీరసముపచ్చి 12 సం॥ మౌనము విడచెను. అన్నము తినగలుగుట; రుచికి తినవల్ల గాక ఆకలికి తినుట. (1930 సెప్టెంబరు నుండి డిశంబరు వరకు)

17. ఎచట నుందుమనినను మొదటియిల్లు తనదికాదని వెడలగొట్టిన శక్తియే "అది నీది కానిది, యిది నీదా?" అని అచటినుండి లేపుట; ఈ విధముగా కొన్నిదినములు గడచిన తదుపరి, "ఇది కాకపోతే, అది నీదా? ఏది నీ లమ"ని పశ్నించ, లము కా ంచక రెండడుగులలో ని పె ను ( 4-10-'34 నుండి 28-2-' 5 వరకు). ఈ రోజులలో అమ ను చేయిపట్టి లాగుకొని వెళ్ళెడివారు. లాగుట విడచినచో ఆ అడుగులోనే యుండెడివారు, ఇటువంటిదే చాతుర్మాస మ బడుచున్నది.

బంగారము మొదలగు లోహములను తాకినచో ప్రాణము గిల గిల కొట్టుకొనెడివారు (కొంతకాలము)

1 . పాపము ణ్యములు లేనివాడు పరమాత్మయని తెలిసి, పాపము, పుణ్యము, నామము, రూపము, నిరూపి చ కుండ నోరు మూయించెను. తనలో తాను మాట్లాడుకొ ను (1-3-1935 నుండి 14-1-1937 వరకు). రెండడుగులలో నిలచు నిర్బ ధము పోయెను.

19. ఆకలిదప్పులు లేనివాడు పరమాత్మయని తెలిసెను "ఆకలి దప్పులు లోకానివి, అన్నము, నీరు అ డు గు ట కు నీవెవరివి?" అని ప్రశ్నించగా అన్నము, నీరు అడుగుటకు హక్కులేక పోయెను (4-9-1935 నుండి 14-1-1937 వరకు). ద రనున్నవారే వారి స్థితిని గుర్తించి ఆహారమును, మంచి నీ_ని యిచ్చెడివారు.

20. తప్పు, ఒప్పు తెలియును గాన కాళ్ళు తాకనీయ గూడదని తెలిసెను (1937).

21. ఎవరినిగాని రమ్మనుటకు హక్కు లేక పోయెను. భక్తుల హృదయములే ఆధారమయ్యెను. వినెడి దోషముండుటచే రా అనేవారికి లోబడి, వారు రమ్మను చోటుకెల్ల వెళ్ళి రి. అనగా కార్య కారణములను స్వయముగా వివరించుకొని స్వశక్తితో యెచ్చటికిని పోవుటకు హక్కు లేక పోయెను. ఇది శబ్దమునకు గృహ ధర్మము(1937).

22. మరల మౌనము వచ్చెను. లోపలనుండి వచు జన్మ తరింపు మాటలను సంజ్ఞతో తెలిపి వ్రాయించి (14-1-37 నుండి 5 సం॥లు).

23. ఎవరేని నమస్కారము చేసినపుడెల్ల, ఆ నమస్కారమును రూపించు యెరుకకది బాణమై, యిదివరకు యే భావము పరమాత్మను దర్శించినదో ఆ భావము పరమాత్మను దర్శించు చుండెడిది.

24. ఆకలికి గృహ ధర్మము వచ్చినది. అనగా రోజుకొ సారి మాత్రమే భక్తులకు లోబడి తినెడివారు. తిని చేయి కడిగిన తదుపరి తినవలెనను తలంపురాక ఆ రోజున మరల తినెడివారు కారు. (1937 వా స్రాశమం)

25. స్నానము చేయుటకు యిచ్ఛ లేక పోయినది. కార కారణము కనుపించక, స్నానము భోగమై కాన్పించి, అభిమానమువచ్చి స్నానము మానుకొని. కడనున్న స్త్రీ తాను తాకక, తనను తాకనీయక యెదిగి యుండునట్లు, యిచ్ఛ అంటు వస్తువను భావము కలిగి, ఎవరిని అంటుకొనక, తనను అంటుకొననీయ కుండిరి 1-1-1939 గోవాడ).

26. "గుడ్డ మాపు నీదియు, ఆ గుడ్డను వుతుకుటకు మరి యొకరునా?" యన, ఆ గుడ్డను స్వయముగా వుతుకుకొనిరి (30-4-1939).

27. వాక్కునకు గృహ ధర్మము వచ్చెను. అనగా యింటి వెలుపల ఎవరినిగాని రూపించుటకు అభిమానమువచ్చి పగలు యింటిలోని వారిని మాత్రమే రూపించెడి వారు. ఎట్లన, భార్యా భర్తలు అభిమానము కలిగి రహస్య లమున ఎట్లు అభిమానములేక వర్తింతురో, అటులనే పగటివే యింటి వెలుపల యెవరితోడను మాట్లాడక, యింటిలోపల మాత్రమే మాట్లాడెడివారు. రాత్రులందు లోపల, వెలుపల అనుభేదము లేక మాట్లాడెడివారు. కొన్ని పనులు చేయుటకు చేతులు వచ్చెడివి. చేయగలుగు పనులను చేయుటయేగాని, యితరులతో చెప్పి చేయించరైరి (17-9-1939 పోటుమెరక).

28. నడచుటకు కాళ్లుండగా రైళ్ళు, కార్లు ఎక్కుట భోగమని తెలిసి కాలినడకను మాత్రమే యెక· డికేని వెళ్ళెడి వారు. నదులు, కాలువలు దాటవలసి వచ్చిన డు మా విధిలేక పడవనో, బల్లకట్టునో ఎక్కెడివారు (6-4-1940 .

29. ఆకారము, అందము యిచ్ఛయని తెలిసి, పోయిన అలంకా ములు పోగా మిగిలిన గుడ్డను వుతుకు కొనుటకు అభిమా ము వచ్చెను. భర్త చచ్చిపోయిన స్త్రీ, త్రెంచిపోయు సమయమున, తన అలంకారములు పోవుట తెలిసియు నగలు పెట్టుకొనుట యెట్లుండునో, గుడ్డ వు కుకొనుట అట్లుండునని తెలిసి వుతకలేక పోయిరి 26-10-1 4 .

30. తన హీనస్థితి తెలిసి వాకిలిగల యిండ్లలోనికి వాకిలిద్వారా వెళ్ళలేక పోయిరి.

31. చలికి యింకొక గుడ్డను అడుగలేకయు, యితరులు కప్పిన ఊరుకొనుటయు, ఆ కప్పినగుడ్డను చెమటపట్టినను తీసి వేయజాలక పోవుటయు, చలి, ఉక్క యితరులే కనిపెటి బట్ట కప్పుటయో తీసివేయుటయో జరిగెడిది. రాత్రులం దధికముగా కప్పిన వస్త్రములను ఉదయమున తీసివేయ గలిగెడివారు. (16-10-1943 కోసూరు అంజయ గారి పాక, కోసూరుపాలెం).

32. ఎవ్వరైన నమస్కారము చేసినచో విషయ రూపముగానున్న తనస్థితి హీనమని తెలియుటచేత, ఆ మహా పూజ్యతను భరింపలేక పడిపోయి, చేతులు కాళ్ళు వంకరలు తిరిగిపోయి బాధపడెడి వారు (1943).

33. నమస్కారము కనబడకుండ నుండుటకై యితరులను నమస్కారములు చేయవలదనుటకు మారుగా, తానే వారివంక చూడకున్న మంచిదని తలవంచుకొని యుండిరి. నమస్కారము చేయువారిని ముఖాముఖిని చూడ మానుకొనిరి (26-2-1944 నుండి 16-10-1945 వరకు).

34. విరోధభావము లున్నవారి హృదయమునందాత్మ క స్థానములేదు గాన, అట్టివా ఆ రము నిష్ప యో జనముగ కాన్పించి, వారి యా మును తీసుకొనలేకపోయిరి (9-2-1945 బొబ్బర్లంక .

5. అన్నిలో ములు కనబ వర్ణించిరి (1 -2-1945).

36. సత్య శాంత దయాది గుణములకు శ్రాద్ధము

చేయవలెనని మాలోని శక్తి పలికినదని అమ్మ తెలుప, అచట నున్నవారు అట్టి కర్మచేసి అమ్మ కాహారమిడిరి (15-2-'45).

37. తిరిగి హద్దులు వచ్చెను. విరోధులున్న వారిడు ఆహారము తీసుకొనకపోయిరి (16-2-1945).

38. శరీరమునకు గృహ ధర్మము. పగలు బయట మనుష్యులు చూచుదురను భయముతో యింటిలో నుండెడి వారు. రాత్రివేళ బయట తిరిగెడివారు (9-10-1945 రేపల్లె

39. తలవంచి మాట్లాడెడివారు. అనగా యితరుల దృ తమదృష్టి కలియుట కభిమానమువచ్చి మనుష్యుల ముఖములను చూడలేక క్రింది భాగమును చూడగలిగెడివారు (ప్రారంభం 20-2-1947 రేపల్లె బసవయ్యగారు వేయించినపాక, క్రొత్తపేట ఆఖరు 23-1-1949 పులిగడ్డ).

40. స్వతంత్రించి మంచినీరు తాగుటకుకూడ హక్కు లేకపోయినది. దాహమును కనిపెట్టి ~ంచినీరుకూడ యితరు యిచ్చెడి రు 1-8-1947 .

4 ఆ ~ము తినుటకు యిదివరకున్న 12 గం.లు అ~ హద్దులేకపోయెను (6-8-1947 దోనేపూడి). విరోధులున్న వారిడు ఆహారముకూడ తీసుకొనిరి.

42. రెండు దినముల కొకసారి భోజనము 3-1-1948 (క్రొత్తపేట పాకలు).

43. గాంధీజీ కర్మనాడు భోజనములు చేయుసమయమున ప్రసాదముగ చూచునపుడు క్షణకాలము గాంధీ రూపయిరి (12-2-1948 మోపర్రు).

44. పంచేంద్రియముల గృహస్థధర్మము పోయెను. "ఎవరి ధర్మానికి వాళ్ళు కర్తలా? బిచ్చగాళ్ళు కర్తలా?" యని లోకేషణ యయిరి. పగలు బయటకువచి మాట్లాడిరి. ఆహార విషయములో ఇదివరకున్న హఠాలన్నియు తొలగిపోయెను. శివతాండమును చూపించిరి (6-9-1 48 అవ గడ్డ సమీపమున క్రొత్తపేటవద్ద పాకలు).

45. కన్నులు యోనులుగా కనబడెను. "మన ముఖము వుంటేనేగదా అద్దములో ప్రతిబింబము కనబడేది. అట్లే మన అసత్యమునకే గదా యీ అసత్యపు లోకమంతయు కనబడేది" అని యేడ్చి యేడ్చి, "యీ అ త పు ముఖమును మీరు చూడగూడదని ముఖముతో సహా ముసుగు వేసుకొని మాట లాడక యితరులను చూడలేదు (7-2-1948 పులిగడ్డ ప్రాజెక్టు). మరల మరురోజున కన్నులను యోనులుగా చూపిన భావము తగ్గి ముసుగును తీసివేసి అందరిని చూచిరి.

46. వినువారికి తెలియదని తెలిసి, ప్రజలతో మాట లాడేదానికి, మాటలాడని యెరుకతగిలి మాటలాడలేక పోయిరి (26-12-1948 నుండి 20-1-1949 వరకు).

47. "భక్తులపాలిటి భాగ లక్ష్మి రావే ' యను శబ్దము అమ్మలో వినబడి, భక్తులకు లోబడేది వారిలోనున్నదని తెలిసి పులిగడ్డనుండి క్రొత్తపేట చావడివద్దకు వెళ్ళిరి ( 0-1-1949).

48. స్నానముచేసిన ఎట్లుండునో యని వేడి నీళ్ళ స్నానము చేసిరి. కాని సుఖము కనుపించలేదు (8-4-1949 భీమవరం ప్రకృతి ఆశ్రమం).

49. నీరసం. ఎక్కడకు వెళ్ళే దికనబడ లేదు (25-5-1949 పాలకోడేరు).

50. భిక్షుకత్వం వచ్చి తినవలెనని యుండినను ఎవరైనను తినుమనిన పదార్థమునే తినగలిగిరి. కాని అడుగ వీలు లేక బాధపడిరి (1952 బ వరి నెల, శాంతికుటీరం, పేపేరు)

51. "అచ్చుటచ టూ తిరిగేదానవు యిచటే వుండ రాదా?" యన, శాం కుటీరం తూర్పు వసారాలో నుండిరి (17-4-1952 నుండి).

52. "ఇచట వుండేదానవు అచటచట ఎదుకుండ హాడద"న, తూర్పువసారానుండి వెళ్ళగొట్ట బడిరి 23-2-1953 నుండి .

53. రంగాగారితో మాట్లాడిన యన తరము మాట్లాడు టకు పెదవి లేవలే పోయెను (ఏప్రిల్ 3 నుండి ఆగస్టు 1953 వరకు).

5 . శాంతికుటీరం పడమ సరిహద్దున వుండి (సెప్టెంబరు 1953 నుండి 7- 2-1 56 వరకు).

5. ప్రక్క కైవాడుకొను బట్టలు వగైరా వాడుకొను హక్కు లెక చాప దనే పరుండుట; (23-10-'56). చివర చివరకు మంచినీరు మినహా ఏమియు అడుగ హక్కు లేక పోయెను.

# శ్రీ చిన్నమ్మ

# జీవిత సంగ్రహము

పూర్వజన్మ సంస్కార జనిత పుణ్య విశేషంబుచే జానిగా వెల్గొంది, లోకవృత్తులి యు నొకటొకటిగా హితమై, శాశ్వతానంద స్థితినిబడసి, ఆధ్యాత్మిక జిజ్ఞాస పరులకు దివ్య మార్గదర్శినియైన వ్యక్తి శ్రీ చిన్నమ్మగారు. శ్రీకృష్ణ, బుద్ధ, వేమన, రామకృష్ణ పరమహంస, రంగావధూత, దొంతులమ్మ, మడుగులస్వామి మున్నగువారి సాంప్రదాయమునకు చెందినవారు వీరు. గొప్ప జ్ఞాని.

## బాల్య జీవితము

గుంటూరుజిల్లా రేపల్లెతాలూకాలోని గొరిగపూడి యను గ్రామమున లక్ష్మయ్యగారను నొక కాపు ధనిక మహాశయుడుండెను. ఆయన కిద్దరు కుమారులు, యిద్దరు కొమార్తెలు కలరు. వారిలో కడసారిబిడ్డకు మాచమ్మ యని పేరిడబడినది. ఆమెయే కాలక్రమమున శ్రీ చిన్నమ్మ యను సుప్రసిద్ధ నామముతో వ్యవహరింపబడినది.

వీరి జననకాలము నిర్ధారణగా తెలియదు. కాని 1887 సంవత్సరమని యూహింపబడు చున్నది. వీరు చిన్నతనము నుండియు శుగ సాత్విక స్వభావము కలవారు. వినయ విధేయతల కీ తల్లిని చెప్పి మరొకరిని చెప్పవలయు ననిన నతిశయోక్తి కాదు. అత్యంతము సత్యప్రియురాలు. శైశవమున యీ సద్గుణములను గుర్తింపజాలని వారాబిడ్డ వర్తనమును జూచి వింతపడు చుండెడివారు.

తమ చిన్నతనములో ఎవ్వరైన మనుష్యులు చనిపోవుట చూచినపుడుగాని, వినినపుడుగాని యీ అశాశ్వత దేహములను, యీ అనిత్య ప్రపంచమును జూచి వారిగుండె యెప్పుడును దడ దడ కొట్టుకొను చుండెడిదట.

పసితనమున నొకసారి యింటిలో కూర్చుండి యీమె చలిది కుడుచు సమయమున అన్నమెక్కువ కాగా, "అక్కా ! అన్నమెక్కువయినదే?" యనిపలుక దొడ్డిలో పనులుచేసుకొను చుండిన అక్కగారు, "ఎక్కువైతే నెత్తిన వేసుకో" అనెనట. అంతట నా బాలిక మిగిలిన యన్నమును తలపైనిడుకొని అక్కకడకు పోయెను. అంతట అక్కడనున్నవారా అమాయి పుచేష్టను చూచి న రట.

తోడి బాలికలు ఎకసక్కెములాడుచో అపహాస్యమును భరింపలేక యీమె యేడ్చెడిదట. అప్పుడు పెద్దవారెవ్వరైనను మరల తిట్టుమనియో, కొట్టుమనియో చెప్పగా, అటుల చేయ నొల్లక, 'నేను అనిపించుకొనుటకే పుట్టినాను' అను భావమును వెల్లడించెడిదట. కాని కోప తాపములతోడ నేమియు చేయ

నొడంబడు టెన్నడును లేదు. కొద్దికాలమయిన వెనుక 'ఎవరి తిట్టు వారిదే. ఎవరి వెక్కిరింపు వారిదే. మనకేమి?' అని తెలిసిన తరువాత ఆ ఏడుపుకూడ లేకుండ పోయెను.

సాధారణముగ స్త్రీలు తగవులాడుకొను సమయమున, 'నీకడుపు మాడ,' అని తిట్టుటకద్దు. అటులెపుడయిన వారిత యితరులను తిట్టుట జరిగిన, 'అలా తిట్టరాదు. ఎవరి తిట్టు వారిదే. ఈ తిట్లవలన నీకేగదా నష్టమ'ని హెచ్చరించెడి వారట.

పదునాలుగు వ రముల వ యు సు న గ గపాటి గోవిందయ యనువారికిచ్చి యీమెకు వివాహము చేసిరి. తలంబ్రా పోయుసమయమున భర్తగారొక్కరే తలంబ్రాలు పోయుట జరిగినది. ఆ యమ మాత్రము పోయలేదు.

# గృహస్థజీవితము

తలిదండ్రులు తన తనువును భర్తకొసగినందున, అది సంపూర్ణముగ ఆయన స్వామ్యమయ్యెనని, మాచమ్మగారు అత్తవారింట కాపురము చేయునపుడు, దాస్యభావముతో సకల గృహకృత్యములను లోటులేకుండ చేసెడివారు. భర్త యాజ్ఞలేనిది కాయికముగా నేపనియు చేసెడివారుకారు.

ఒకసారి యిరుగు పొరుగు యువతులు సముద్రస్నానము నకు బోవ నుద్యమించిరి, ఈ అమ్మనుకూడ తోడ రమ్మనగా భర్త యిష్టపడుననితోచి వారితోబోవ నొడంబడెను. కాని భర్త వలదనెను. వెంటనే ఆమె ప్రయాణోద్దేశమును మానెను. తోడివారి కుత్సాహము కుంటువడినది. వారును మానిరి. వారికి మనస్తాపము కలిగిన దనియు తాను దానికి కొంత కారణ భూతురాలననియు నామె పరితపించు చుండెను. అట్టి సమయమున లక్ష్మీదేవమ్మయను నొక స్నేహితురాలు (తదుపరి ఆమె పెద్దమ్మయని వ్యవహరింపబడినది) ఆమె పరితాపమును బాపనెంచి, ఆమెనుతీసుకొని వెళ్ళి, కృష్ణానదీస్నానము చేయించి, ఒక బ్రాహ్మణునికి దానమిప్పించి, అచటి దేవాలయమునకు తీసుకొనివెళ్ళి, "అత్తకడుపు చల్లన, అమ్మకడుపు చల్లన," అని నమస్కారము చేయుమనెను, అంతట ఈ యమ "నాకేమి కావలయునో నాకు తెలియదు. నీకు తెలియును" అని నమస్కారము చేసెనట. లక్ష్మీదేవమ్మగారిది విని "అదేమిటే, అట్లా చేసినావు" అనెనట.

ఇతరులవలె హరికథలు, బుర్రకథలు మొదలగునవి విని నపుడు ఆ కథలో ఎక్కువగా వినబడు వంత చరణము తప్ప మరేమియు గుర్తుండెడిది కాదట. కొంతకాలమయిన తదుపరి యీ కథలు, నాటకములు, సినిమాలు చూచు వారి విషయములో వారి భావన యిది: "ఒకసారి కథ విన్న తరువాత అటుల నడువలేనపుడు, యింక మాటిమాటికి కనుట, వినుట దేనికి?"

"ఊరంతయు యిన్ని కుండలేల? ఒకే కుండ ఎందుకు వండుకొనరాద"నెడి యున్నత భావన ఆ కొద్దివయసులోనే వారికి కలుగుచుండెడిదట.

ఎవ్వరైనను బ్రతికి చెడ్డవారున్న, సంఘములో వారికి నగుబాటు రాకుండ, రహస్యముగ వారికెంతయు సాయపడు చుండెడివారు రు.

కాలక్రమమున వీరికి అయిదుగురు బిడ్డలుపుట్టి పసితనము ననే చనిపోవుచు వచ్చిరి. వారు చనిపోవుచున్న తరి, ఋణము తీర్చుకొని పోవుచున్నారనెడి భావనతో కంట తడి పెట్టెడివారు కారు. మరియు గతజీవుల నింటినుండి తీసుకొని పోయిన వెంటనే యింటిపనులు చేయుటకును, కాలువకుపోయి నీరు తెచ్చుటకును సమకట్టెడివారు. కాని ఆ శిశువులు బ్రతికి యున్నంతకాలము, ప్రాల్మాలిక లేక, అత్యంతశ్రద్ధతో సమస్తోప చారములు చేసెడివారు. నిస్సంగముగ సమస్త కార్యములు నిర్వహించెడివారు.

ఎప్పుడైన అప్పు నెగవేయునెడల అప్పిచ్చిన వారు, "ఇప్పుడెగవేసినను నాకొడుకైపుట్టి ఋణము తీర్చెదవులే"

అనుట కలదు. మరియు "నవ్వుచు అప్పులెగవేసి, యేడ్చుచు తీర్తుర"ను నుడియు కలదు. మాచమ్మగారి నడవడి దీని వ్యతిరేకము. బిడ్డలు ఋణగ్రస్తులై పుట్టుదు రనుట వీరి సమ్మతము కాదు. తలిదండ్రులే ఋణగ్రస్తులనియు, వారొకప్పు డెగగొట్టిన ఋణములను తీర్చుకొను అవకాశము కొరకే బిడలు ట్టుదురనియు, వీరు చెప్పెడివారు. గతమున కృప ణ తో నపహరించిన దానిని, మమతతో, పుత్రవాత్సల్యముతో తలిదండ్రులా ఋణము తీర్చుకొందురనియు, మీదు మిక్కిలి ఆ బిడ్డలు పోయినపుడు మమతచే మోహితులై యేడ్తురనియు అనెడివారు. కాని అప్పులవారు వచ్చి అప్పులు జమచేసుకొను స దర్భము వారిని సమర్యాదగా జూచి, వారు వచ్చినప నె వేర్చి, ంతోషముగా పంపుట ్య యము. బిడ్డలు పుట్ట నపుడును, పెరుగునపుడును, చచ్చునపుడు అట్టి భావములతో మెలగుటొప్పగును. ఆ తీరున మాచమ్మగారు ఆదర మాతయై వఱలిరి.

## పోట్ల ఎద్దు

ఆ కాలమున గోవిందయ గారి వద్ద ఒకఎద్దు కలదు అది కొంచెము పోట్లస్వభావము క దగుటచే దానివద్ద కెవరు ర సాహసించెడివారు కారు. ఒకనాడ త్రాడు తెం ్కొని వా వెంట బడినది. ఎదురుగావ దా రలించ నే ని ధైర ముచాలక పోయెను. వెను నుంచి యై ను, దా ట కేదే యాధారము చూచుకొనిగాని అదలించెడి వారుకారు. అప్పుడైనను ఆ అదలింపు వినగనే అది వారివెంట బడెడిది. ఇట్లెందర రెన్నివిధముల ప్రయత్నించినను ఫలితము కాన

రాదయె . అందరు అలసిపోయి చేయునది లేక దాని వెంటనే తిరుగుచు డిరి. తుదకదియును తిరిగి తిరిగి వచ్చి చావడిలో ప్రవేశించినది. చావడి చుట్టును ప్రజలు గుంపులుగా కూడి యుండిరి.

ఇదిచూచి మాచమ్మగారు, "ఎందుకట్లా దాని వెంటబడి కష్టపెడ్తారు?" అనిఅనెను. అంట గోవిందయ గారు "యితే నీవు కట్టేయి. మాటలు కాదు" అని ఉద్రిక్తుడై పలికెను. చెప్పినట్లు చేయుటయే విధియని మాచమ్మగారు దానిని కట్టి వేయ బయలుదేరిరి. 'పొడుస్తుంది, వద్ద'ని ఎందరు వారించినను వినక, శరీరముపై నిమురుచు ముందుకుపోయిరి. కాని అది మాత్రము అమ్మనువిడిచిపెట్టి, బుసలుకొట్టుచు దూరముగనున్న వారిపై దుముక జూచుచుండెను. మాచమ్మగారు దాని రెండు కొమ్ములను పట్టుకొని త్రాటితో కట్టివైచిరి.

## సచ్చిదానందమూర్తి జ నను

ఆరవ సంతానముగా నొక బాలుడు (సుమారు 1911) జనించెను. పెద్దమ్మగారు మ్రొక్కులు మ్రొక్కుకొని, దానములుచేసి ఎని నెటులయిన బ్రతికించుకో నెన్నెన్నో ప్రయత్నములు చేసిరి. బిడ్డడు బ్రతికినాడు. ఈ బాలునకు సచ్చిదానందమూర్తియని పేరు బెట్టిరి. ఈతని సౌమ్యభావము, శాంతి దమాది గుణములు వీనిని సాధకనాముని గావించినవి. వీనిం గూర్చిన యొక యుదంతము పేర్కొందముగాక.

మాచమ్మగారు తన యలవాటుచొప్పున నొక సారి గ్రామాంతరమునగల జ్ఞానియని ప్రసిద్ధిగన్న యొక సాధ్విని

జూడ బోయిరి. బాలకుని నింటికడ విడిచిపోయిరి. సాయం కాలము తిరిగి వచ్చునప్పటికి బాలకుడు గతజీవి యయ్యెనని బయటపెట్టుకొని యేడుచుండిరి. చిన్నబిడ్డ గుణమువచ్చి జీ చిహ్నములులేక పడియు బాలుని మాచమ్మగారు భుజము నిడుకొని యింటిముందు తాము నాటియున్న తులసిమొక్క దాపునకు బోయి, దానిని కివేయుటకై చేతితో పట్టుకొనిరి. తత్క్షణమే భు మునున్న బాలుడు తుమ్మెను. క్ర మే ణా ఆరోగ్యము పొందినాడు. ఒక విషయము, వీరు తులసిపూజ చేయుట, భర్తచె వ ల చేయవలె నియే గా , తాముగా పుణ్యము సంపాదించవలె నెడి దృష్టితో కాదట.

అన్నియు నేనే - ఒకటియు నేను కాదు

ఈ బాలుడు నించిన ఇరువది యొకటవ దినమున (సుమారు జూన్ 1911) మాచమ్మగారికి, "అన్నియు నేనే ఒకటియు నేనుకాదు" అనెడి తి ప్రారంభమయినది. సాధా ణముగ వారి అవయవములు "అన్నియు నేనే" యను భా ముండి పనిచేయు చుండును. కాని "ఒకటియు నేను కాదు' యని కాన్పించినపుడు, పనులు చెయుచుండిన, ఆ ప ను లు తటాలున నాగిపోయి, చేతనున్న వస్తువులు పడిపోయెడివి. వడ్లు దంచుచుండగా, ఒకటియు నేనుకాదను భావము స్ఫురించుచో, పైకెత్తినరోకలి అటులనే హఠాత్తుగా చేతనుండి జారి పడి పోయెడిది. చేయి యున్నదున్నటుల నిలచిపోవును. సీఘ తోడుచుండుతరిని వేలనుభావము తట్టెనేని, చేదను పైకిలా గలిగెడి వారు కారు. చేతులున్న వున్నటుల నిలుచును. మరల 'అన్నియు నే. (దేహము నేనే) యను భావముకలిగిన

యథాప్రకారము పనులు చేయగలిగెడివారు. ఇటుల రెండు సంవత్సరములు గడచెను.

"ఒకటియు నేనుకాదు" అనునపుడు తాను వేరయి, శరీరము తోలుబొమ్మ యగుటచూచి, 'నేను గదా యీ శరీరమును వాడుకొనది. నేను లేనియెడల దీనిపని ఖాళీ' యనునటుల ఆ మాయ యెంతయో విపరీతముగ నవ్వెడిది. వీరి కపుడపుడు కలుగు ఈ విపరీతపునవ్వును ఒకరి శిష్యులు చూచి ఆశ్చర్యము చెంద, శిష్యులకోరికపైననే వారి గురువుగారు, 'యిదెంతభాగము. మేమును అట్టి యానందమును తెప్పించగలమ'ని శిష్యులకేదియో మందిడుట, తన్మూలముగ వారు, ఆనందములేకగా బాధపడుట సంభవించినది. తదుపరి వారికి విరుగుడు మందిచ్చి, మందును కక్కించిరి. అపుడా గురువుగారు భయపడి ఆ సమయముననే స్వగ్రామమునకు వెళ్ళిపోయిరి.

## పరమాత్మ దర్శనము

సచ్చిదానందమూర్తి పుట్టిన రెండు వత్సరములకు వెంకట్రామయ్యయను కుమారుడు పుట్టెను. వీని కెనిమిదినెలల వయసున (1914) తల్లి పొరుగింట కొందరిస్త్రీలతో కలసి కూరుచుండి యుండెను. వేసవి కాలము, మధ్యాహ్న సమయము. అపుడు హఠాత్తుగా నామెకు దేదీప్యమానమగు వెలుగు కానుపించినది. పెద్దమెరుపు గోచరించునపు డన్యమేమియు గోచరించని తీరున, అపుడు వారికితరమేమియు గాన్పింపలేదు. ఈ మెరపు మధ్యాహ్నవేళ సూర్యకాంతి నతిక్రమించి ద్యోతక

మగుట వారి కాశ్చర్యముగా నుండెను. తను చుట్టునున్న వారిని 'యిపుడు మెరుపు మెరిసినదా?' యని ప్రశ్నింప, వారు చూడ లేదనిరి. కొందరు వింతపడి, 'ఇప్పుడు మెరుపేమిటమ్మా?' యనిరి. కాని మాచమ్మగారికి మాత్రము తాము దర్శించినది పరమాత్మయే యని దృఢవిశ్వాస మమరినది. పరమాత్మ లోక రహితమైనదనియు, అందు ప్రకృతికి స్థానము లేదనియు తెలిసినది. తదుపరి ఆ దివ్యకాంతి తరచు కాన్పించు చున్నను, సు రముగ లేని కారణముగను, దాని దర్శనములేని సమయమును లంబు ప్రపంచము గోచరించుటవలనను, పరమాత్మ సాధారణ మానవు ఎరుకకు గోచరించునది కాదనియు, పరమాత్మను జూచు నెరుక వేరనియు వారికి నిశ్చయము కలిగినది.

మొదట 'అన్నియు నేనే - ఒకటియు నేనుకాదు' అనుచు వేరుపడుతెలివినే వీరు పరమాత్మగా భావించిరి. కాని యదార్థము కాన్పించుటతో అది మాయ యని దృఢపడినది.

### కొన్ని మహిమలు

గొరిగపూడిద ర నొక గ్రామములో కొల్లూరు దుర్గయ యను పిచ్చివాడుం ను. అతని పేరుచెప్పిన అందరును భ పడెదరు. ఒకరోజున అమ్మవగకు వ "అమ్మా! సీతమ తల్లీ! అన్నము పెట్టుము'ని అ గెను. మాచమ్మగా రన్న తెచ్చుటకై యింటిలోనికి వెళ్ళిరి. ఇంతలో అతడు అచటనే మూలనున్న రోకలిబండ యొకటి తీసుకొని గిర గిర త్రిప సాగెను. అమ్మకేమైన ప్రమాదము కలిగించునేమో యని అందరు భయపడిరి. అమ్మ అన్నముపెట్టగనే అతడా రోకలి

బండను క్రిందబెట్టి దానిమీదకూర్చొని, సాధువువలె అన్నము తిని పోయెను.

మరియొకపరా యమతడు ఒక నాగలిదుంప భుజమున నిడుకొని అమ్మవద్దకు చ్చెను. అమ్మ అపుడు ఉలవలు రు చుండిరి. ఆ దుంప క్రిందబడ వైచి, అమ్మ పాదములపై బడి, "నమసా రము సీతమ్మ తల్లీ!" అని యనెను. "తప్పుకాదా నాయనా అలా కాళ్ళమీద పడవచ్చా!" అని అమ్మఅనిరి.

ఒకనికి జబ్బుచేసి సంధించినది. ఆ సంధిలో పూర్తిగా మతిచెడి పి వానిలా వ్యవహరించు చుండెడివాడు. అమ్మ అతనిప్రక్కల కూర్చొనగనే అ నిసంధి వెంటనేతగ్గిపోయినది.

దొంతులమతో

అతీతు లెచటయినా యున్నవారిని రించి, తమ యను చరులను వారివద్ద నుండుమని ప్రోత్సహించే వారు అమ్మ.

అప్పటిలో (1927) బందరులో అతీత స్థితిలోనున్న దొంతులమ్మ యను వారొకరుండిరి. పెద్దమ్మగారితోడ ఒకటి రెండు పర్యాయములు అమ్మ వారిదర్శనమునకు వెళ్ళిరి. ఒక పర్యాయము వెళినపుడు అమ్మ దొంతులమ్మగారి నిట్లడిగిరి:- "అమా! లోక గుణములన్నియు ఒక్కసారే విడిచిపోవునా లేక ఒకొక్కక్కటే పోవునా?"

'అయే తాయి' -ని దొ తులమ్మగా దాపున నున్న ఒక ను తీసుకొని సీ ని ంచెము వంచివేసి, కొ తడవా, మ కొ స చివేసి, మ ల

ఆగి, తుదకు నీటినంతటిని పారబోసి వట్టి ముంతను జూపిరి. అంతట అమ్మ సంతసించి, 'అమ్మా! ఒక్కొక్క గుణమే క్రమముగ విడిచిపోవుచు, చివర కన్నియు పోగా నిర్గుణము మిగులునని తెలిపితివా?' అని ఎంతయో మక్కువతో వా గడ్డమును నిమిరెరి.

మరొక పర్యాయము వెళ్ళినపుడు, దొంతులమ్మగారు, 'గాజులూ ... తాలిబొట్టు.... అటుచూడు' అనిరి. అనగా గాజులు, తాలిబొట్టు మొదలైన వేవీలేని తి ఒకటున్నది. అదియే పరమాత్మయని వారి భావన. ఈ భావమును గ్రహించి అమ్మ యెంతయు ఆనందించిరి.

## తండ్రి భావము

వెంకట్రామయ జనించిన రెండేండ్లకు 1916) శ్రీరామమ్మ యను కుమారిత జనించినది. గర్భవతియైయున్న కాలముననే వీరి యారోగ్యము సరిలేదు. పురుటిలో నొకనాడు భూశయనము జేయుట తటస్థించినది. ఆ సమయమున బాహ్యా స్మృతిలేక పడియుండగా మాచమ్మగారి కొక ముదు లిది గుమ్మముమీద కూర్చుండి యున్నటుల కాన్పించినదట. అటు ఇంటిలోపల అగాధమగు చీకటి కోణముగా నున్నదట. టు దేదీప్యమానమగు ప్రకాశము. ఆ ముదుసలిది వీ తో 'అమ్మాయీ! విటు వచ్చేదానివా లేక అటు పోయేదానివా?' అని ప్రశ్నిచిది. ఆ చీకటి యఘాతము గాం భీతిలిన మాచమ్మగారు రా నెనట. "అట్లయిన నీ దారిని నీవు పో" అని ముదుసలిది అంతులేని ఆ చీకటి గో లోని

జారిపోయెనట. ఇంతలో స్ప హా వ ి నది. । మముగా బల సత్వములు లభించినవి. ముదు ́లిది చూపిన మార్గము సంసార కూపము. మాచమ గా రెన్నుకొనినది ప్రకృతి రహితమౌ ఆత్మగతి.

పై ఘటనా సందర్భముననే పితృభావ ముదయించినది. ఆరుమాసముల తదుపరి ఒకనాటిరేయి భర్తగారు వీరి మంచము సమీపించుతరి, వీరికిభయము కలిగినది. వీరిని చూడగనే భర్తగారిగుండె ఝల్లుమనెను. ఆయన కీమె తల్లిగా కాన్పించి నది. ఈమె కాయన తం ిగా కాన్పించెను. అప్పటినుం మాచమ్మగారు వీరిని '౹౹ వింగయ్యబా౹౹' యనియు, వీరు మాచమ్మగారిని "అమ్మా" య యు అనె వారు.

పె మ్మను పిలుచుట

ఒకపరా యము వెంకట్రామయ (ద్వితీయ పుత్రుడు) గా ద్ద జ.. చసినది. యమ ̀ సు చనలు కనుపించలేదు. అ ్పటికే అమ కు గొప్పవారనె పేరువచ్చి యు న్న ది. గోవిందయ్య గా పుడు, 'నీ త మేమిటో డు చూసాను గదా" (నీ స త్యము ౨ । తు లె గదా అని య . అంత అమ్మ 'వీడి ౹ ఐ పో త వీడితోపాటు -ణం కూడ పోవలసిందే" అ ఆ కు౹ వానికి జబ్బు ుకు పై బయట ట్టు ప స్థి వచ్చినది. అమ అట్లని రేగాని, మాట యసత మగునేమోయని తదుపరి భయపడిరి. అథవా ఆబాలుడు చనిపోవుట జరిగిన అమ్మ చనిపోవుటెట్లు? ఏమియు తోచలేదు. వెంటనే అచటికి 10 మైళ్ళ దూరమునగల బొబ్బర్లంకలో

యున్న పెద్దమ్మ కనుపించి, "అమ్మా!" యని బిగ్గరగా కేక యిడిరి. ఆ సమయములో పెద్దమ్మ పలుదోముకొను చుండిరి ఈ కేక వినిపించగనే ప్రక్కనున్న వారితో, "ఇదేమిటే మాచమ్మ 'అమ్మా!' అని పిలుస్తోంది" అని పలికి వెంటనే బయలుదేరి యీ అమ్మవద్దకువచ్చి, 'ఎందుకే నన్ను పిలిచావు?' అని యడిగిరి. అప్పుడు అమ్మ, 'వీడికి జబ్బుచేస్తే నేనిలా అన్నాను. మాట అసత్య మవుతుందేమోనని భయమేసింది. ఒకవేళ వాడుచనిపోతే, నేనెట్లా చచ్చిపోయేది?' అని చెప్పిరి. 'వాడేమిటి? చచ్చిపోవడ మేమిటి? వాడి ప్రాణానికి నా ప్రాణం అడ్డం' అని పెద్దమ్మగారు హామీ యిచ్చిరి. కుర్రవాడు సజీవుడై క్రమముగా ఆరోగ్యము పొందెను. చివర కుభయుల వాక్యములు సత్యమయినవి.

## పనులు చేయు శక్తి పోవుట

అమ్మ యథాప్రకారము యింటి పనులన్నియు చేయుచునే యుండిరి. కా పనిచేయుట చాల భారముగ నుండెడిది తమలోపల విచారము పెల్లుబుకుచుండ, నింటికడ నేడ్చినచో నదరు విపరీతముగ భావింతురను తలంపుతో కందిచేలలోని పైయి బిగ్గరగా వెక్కి వెక్కి యేడ్చెడివారు. దుఃఖ ముపమించి మ ట తిరిగి వచ్చెడివారు.

ఒకనాడు గోవిందయ్యగారు 'ఇట్లా యేడుస్తూ చేస్తుంటే మాకు మంచిదికాదు. రేపటినుంచి పనులేమీ చేయనక్కరలేదులే' యనిరి. మరుసటి ఉదయము నూర్చుకొని వచ్చిన ధాన్యమును మగవారు పాతరలో పోయుచుండిరి. అమ్మ వచ్చి

మిరపకాయలు వేయించు చుండిరి. అపుడు, 'నీనుంచి బాగు పడేవారున్నారు. చెడిపోయేవారున్నారు. లే,' అని అమ్మకు తనలోపలనుండి ఒక శబ్దము వినిపించినది. ఇకనేమున్నది: 'నన్నెత్తుకు పోతోందే,' అని అమ్మ పెద్దగా ఆవురుమనిరి. ఆ కేక విని పాతరలో ధాన్యము పోయువారంతా పరువిడి వచ్చిరి. 'నిన్నేమిటి? ఎత్తుకు పోనీయడ మేమిటి? తలుపులు వేస్తాము.' అని వారనిరి. 'ఇంటికప్పు ఎగురగొట్టుకొని ఎత్తుకు పోతుందట' అని అమ్మ స్పృహతప్పి పడిపోయిరి.

ఆ సాయంకాలమునకు స్పృహ వచ్చినది. తక్షణమే ఎవరో ఆమెను హఠాత్తుగా గుద్దినట్లయినది. ఆ దెబ్బతో వారు యింటినుండి బయటికి వ^ రి. మరల నింటిలోనికి పోబోవ, ద్వారముచెంతకు రాగానే కాలు సేతులు సత్తువలేనివై పడి పోయిరి. దాపుననున్న వారిని, తననుఎత్తి యింటిలోపల బడ వేయుమనెను. వారటులచేయ ప్రయత్నించిరి కాని, చేయ జాలక పోయిరి. ద్వారముకడ అరుగుమీదనే వీరుండిపోయిరి

### పిల్లల ఋణము తీరుట

ఒకనాడు సచ్చిదానందమూర్తి బడినుండివచ్చి, కంచములో న న్నము పచ ళ్ళు పెట్టుకొని, నేతిగిన్నెతో సహా తెచ్చుకొని తల్లిదాపునబెట్టి, 'అమ్మా! యీగిన్నె పట్టుకొని నెయ్యివడ్డించమ్మ' అని అనగా అమ్మ అటుల చేయజూచిరి. కాని చేయిరాకపోయెను. "అయ్యో! మీ అమ్మ బ్రతికి యుండగనే, మీరు తల్లిలేని పిల్లలైనారా?" అని యేడ్చిరి. ఆమె లోపలిశక్తి 'ఏయ్! యింతమందికి తల్లివి కావిదే, యీ

పిల్లలకు తల్లివి ఎట్లా అయ్యావ్?' అని పలుకుసరికి ఆ ఏడ్పును లేకపోయెను. పసిబిడ్డ శ్రీరామమ్మకు పాలీయబోవ యివ్వలే పోయిరి. ఆ బిడ్డకూడ తల్లిదాపునకు రాలేక దూరముగా పోయినది.

## మంగళ సూత్రము

ఇంటి పంచనుండెడి రోజులలో ఒకచిన్న సంఘటన జరిగినది. ఆధ్యాత్మిక రంగములో అమ్మ గొప్ప వారని సంగతి అప్పటికే నలుగురకు తెలిసి యుండుటచే నలుగురు వచ్చిపోవుట జరుగుచుండెడిది. ఒకనాడు అమ్మ నలుగురితో కూర్చొని మాట్లాడుచుండిరి. ఆ సమయములో వారి దృష్టి మెడలోవున్న మంగళ సూత్రముమీద పడినది. "ఇదేమిటే, మెడలో?" అని లోపలిశక్తి ప్రశ్నించినది. మెడపై ఏదైనా విషపు పురుగు కనపడిన, భయపడి మనము గభాలున తీసి, అవతల పారవేయునటుల, ఆ మంగళ సూత్రముకూడ ఆ విధముగా కనుపించ, వెంటనేతీసి అవతల పారవైచిరి. అదిపోయి దగ్గర కూర్చొనియున్న ఒకరిపై పడినది. వారుకూడ భయపడి వెంటనేతీసి ప్రక్కనున్నవారిపై విసరిరి. వారుకూడ నటులనే చేసిరి. ఇటుల అచట ంతమంగికలరో అందరి చేతులలో తిరిగి చివరకు వెంకయ్యగారను భక్తులు) నొకరి చేతిలోని పోయినది.

ఈ ఘటనాప్రసక్తి వచ్చినపుడు అమ్మ యిటులనుచుండెడి వారు – 'పెండ్లినాడు మంగళ సూత్రము అందరి చేతులలో తిరిగి చివరకు మెడలోకెట్లు చేరునో, అటులనే దానికి పోటియూ

యనునట్లు మెడలోనుండి తీసివేయబడి అందరి చేతులలోనూ తిరిగినది.

### మౌనము

పనులుచేయు శక్తిపోయి యింటి పంచను వుండుకాలములోనే అమ్మకు మౌనము ప్రారంభమయినది. మౌనమన మాట్లాడగలిగి యూరకుండుటకాదు. మాట్లాడుదమని అమ్మ ఎంత ప్రయ ్నంచినను నోరు, పెదవులు కదిలెడివిగాని, శబ్దము వచ్చెడిది కాదు. పూర్వమువచి న మాటలులేని సినిమాలలోని బొమ్మల పెదవులవలె, వీరి పెద లు కదిలెడివిగాని, శ౦ ము లేదు. ఏదయినను చెప్పవలసివచ్చిన, పెదవుల కదలి ద్వా ం-ను, లేదా సంజ్ఞ ద్వారాను చెప్పుచుండెడి . వారు ఇటుల పం్రెండు వత రములు గడచినవి (19 నుండి 1 0 వరకు). మరల 7 త్సరములు గడచిన తదుపరి రెండవ మౌ ము -రంభ మయినది. ఈ మౌనకాలము సుమారు అయిదువ త ములు. ఈ మౌనకాలములోనే అమ్మలోనుం జన్మ త మాట లనేకము ి నవి. అదికూడ ఋణా ని, చదువులని కార ణముచేత, ాగ వారెవ్వరె ంభవించున డెల్ల సౌజ్ఞతో తెలి , మాలి ఆ మాటలు యిం , వా ని దగ్గ నున్న వారు ్క -స్తకముగా రూప దిం రి. ది యే యీ "మా అ ప లు తె ం పు మా ర్గ ము.'

### ఇంటి ఋణము తీరుట

ఒకరోజున అమ్మ దగ్గరలోనున్న యొక గ్రామమునకు వెళ్ళి తిరిగి వచ్చుచుండిరి. త్రోవలో, నీళ మీద నడచుటకెంత భయమో, భూమిమీద కాలిడుటకంత భయము వేసి, కాళ్ళకు

శక్తి లేక అట్లనే పడిపోయిరి. పరిచితులెవరో వారిని చేతులతో తీసుకొనిపోయి యింటివద్దచేర్చిరి.

కొలది దినములు గడచిన తదుపరి ఒకటికి, రెంటికి బయటకు వెళ్ళగలిగెడివారే గాని. తిరిగి వచ్చుటకు కాళ్ళు వచ్చేడివికావు. అపుడు పది, పండ్రెండేండ్ల బాల బాలికలైనను అమ్మను యెత్తుకొనివచ్చి అరుగుపై కూర్చుండబెట్టెడి వారు. అటుల ఎనిమిది దినములుమాత్రమే గడిచిన . చివరి దినము మామూలుగనే అమ్మ బయటకు వెళ్ళగా, వారిని యెత్తుకొ తీసుకొని వచ్చుటకు ఒకరు వెళ్ళిరి. వారు అమ్మను యెత్తుకొ బోగా 'అంటుకో చూద్దాం' అనియనిరి. అంతట ఆయన వా స తాకలేక పోయెను. ఇంటి ఋణముకూడ తీరినది కాబోలు . ఇక నమే ? దగ్గరలోనే శిథిలమైయున్న రామ మందిర మొకటి కలదు. అదిగో నీ స్థానమనినట్లు లోపలిశక్తి ఆ స్థలమును చూపించినది. వెంటనే అమ్మ ఆ పడిపోయిన గుడి లోనికి జేరిరి. అచటకూడ ఎక్కువకాలముండ వలనుపడలేదు. ఆ గ్రామమునుకూడ వదలిపెట్టి పోవలసి వచ్చినది. ఆ పోవు న డు 'అయ్యో! వూరువిడిచి పోవలసివచ్చింది. లోకములో ఎ రికెట్లా కనుపిస్తానో? అందరికి తల్లిలాగ కనుపిస్తానో లేదో!' యని రోడ్డుప్రక ప్రతిలోబడి ఎంతగానో యేడ్చిరి. వీరి ననుస రించుటకు ఒ రు వీరివెంటరాగా, 'యింతమంది కానివారు కాగా, యింక నీవొక్కడవా నాకు తోడుపడేది?' అని ఒక గీతగీసి, "యీ గీతదాటి రాబోక"ని యనిరి. అంత వారు భయపడి అమ్మ ననుసరించలేక పోయిరి. అంతటితో ఆ వూరు ఋణముకూడ తీరి ది.

# సన్యాస జీవితము

ఊరు విడువబడినపిదప, అందరికిని తల్లిగా కనబడుదునో లేదో యని శ్రీ చిన్నమ్మ* యొదిగి యొదిగి అచటచట తల దాచుకొని కాలము గడుపుచుండిరి. వీరి ననుసరించు వారు కూడ వీరికి తగురక్షణ గల్పించుచుండిరి. ఈ కాలములో వీరెక్కువగా నల్లూరుపాలెం, బొబ్బర్లంక, గొరిగపూడి గ్రామములలో కాలము గడుపుచుండెడివారు.

## ధనము తాకలేక పోవుట

ఒకనాడు నల్లూరుపాలెం గ్రామములో అమ్మ కొంద తో కూర్చుంయున్న సమయము అచటి ఒ నిరుపేదరాలు వచ్చి, 'అమ్మా! పొట్టకు, బట్టకు దోవిధంగా తంటాలు పడతాను. కాని తలదాచుకోటానికి ంచలే యిబ్బ.. పడుతున్నాను. మీరు చెబితే నలుగురూ దైనా సాయము చేయ వచ్చునని చెప్పకుంటున్నా నమ్మా!' అ యనెను. అంత టచట కూర్చున్నవారిలో నొ రు వెం నే 2 రూపాయి బిళ్ళను, 'అమ్మా! ఇదిగో నావంతు ఒకరూపాయి అ అమ్మ పైకి విసరిరి, ఈ రూపాయిబిళ్ళ మీదపడుసరికి నేదియో విప

* అ కు ప్రధానస్నేహితురాలు లక్ష్మీ దేవమ్మగారని లోగడనే పేర్కొం వి. వయసున పెద్దవారగుటచే లక్ష్మీదేవమ్మగారిని పెద్దమ్మ యనియు, చిన్నవారగుటచే అమ్మను చిన్నమ్మ యనియు - కమనుచూ వచ్చినది.

సర్పము మీదపడిన భయపడినట్లుగా అమ్మ భయపడి, నేలమీద పడి దొర్లిగిలిరి. అపుడు రెండు మోకాళ్ళపైన రెండు పుండ్లు పడినవి. ఈ సంఘటనను గురించి ప్రస్తావించునపుడెల్ల తమ మోకాళ్ళ మీదనున్న ఆ పుండ్లమచ్చలను అమ్మ చూపించుచుండెడివారు.

శ్రీ రామకృష్ణ పరమహంస జీవితచరిత్రలోకూడ యి సంఘటనయే కాన్పించును. వివేకానందుడు రామకృష్ణు ప్రక్క క్రింద రూపాయిబిళ పెట్టినపుడు పరమహంస తటాలున లేచి, ఏదియో పురుగుకుట్టినట్లు శరీరము మంటలెత్తుచున్నదని చెప్పిరట.

యీ సంఘటనతో తాము ధనము తాకలేమన్న సంగతి అమ్మకు యిప్పుడే తెలిసినది. కాని వారు పనులు చేయలేక పోయినపుడే ధనము తాకలే తి వచ్చినదని గ్రహించవలెను. తదాది ధనము తాకుట నినసే గజ గజ వణకెడివారు. కొంతకాలము ఒక మన్నుమినహా ఏ లోహపువస్తువులనుగా లేదా ఆ వస్తువుల ధరించిన వ క్తులనుగాని దగ్గరకు రాని వారుకారు. అందుచేత ఆ కా ములో అమ మట్టిపాత్ర వాడుచుండెడివారు.

## మరి కొన్ని మహిమలు

ప్రాథమికదశలో అమ ననుసరించిన వా లో యఱవ వెంకయ గారొకరు. వారు ఒపల్లె బజారునకు వె. ఏదోయొ ఫలహారమును, అమ్మకు పెట్టుకొనుటకై కొని తెచ్చి, దా దాచి, "అమ్మా! ఇదేమిటమ్మా!" యని అడుగగా, వారు

తెచ్చిన వస్తువునే అమ్మ చెప్పెడివారు. ఈ విధముగా కొన్ని దినములుజరిగిన తదుపరి, ఒకరోజున వారికి బజారులో ఏమియు కాన్పించక తిరిగివచ్చి మామూలు ప్రకారమేలడుగగా, ఏమియు లేదని చెప్పినారు.

ఈ వెంకయ్యగారికే ఒకపరా యము శ్వా త ము వచ్చినది. రేపల్లెలో ఒక డాక్టరుగారి చే చికిత్సచేయించుకొని అమ్మవద్దకు వచ్చిరి. అమ్మ, 'నయమయినదా వెంకయా ? పైకమెంతయిచ్చితివ'ని వారి నడిగిరి. వారు 'నయమయిన . నలభై రూపాయ లిచ్చితిన'ని చెప్పిరి. అంత అమ్మ ఇంకా అరవై రూపాయలివ్వాలే! ఎలా యమయింద'ని అడిగిరి.

ఈ మాట అనిన వారముది ములకే మరల చి నదా వ్యాధి. అంత వారు డా రు శ్రీ గరం మంగళ రి గారి వద్దకువె ళ్ళరి. వీరిని డగ , పరిచయస్తు లగుటచే 'అర వె రూపాయిలివ్వండి. రీ ం వజ్ర యంలా చేస్తాను.' అ చనువుకొద్దీ వీపుపై తట్టి చెప్పిరి. టులనే అరువది రూ ము లిచ్చుట, వా ధి కొద్దిదినములలోనే నివా రణ య గు ట జరిగినది.

## మ హ ం స

సుమారు వ స త రమున అమ్మకు ండు పిప్పి పం చిన . వాటి డ ంచుటకు డాక్టరు రసాగ ం మంగళ రి) గారివద్దకు ళి రి. చికిత ప్రారంభించిరి. పండ్లు ంచెము బలవంతముగా కవలసి చ్చుటచే ఎక్కు వ గా రక్తముస్రవించ నారంభించినది. ప్రక్కను వారీ రక్తము

చూచి గజ గజ వణకిపోయిరి. కాని అమ్మమాత్రము ఏమియు చలించక అటులనే నోరు తెరచి వుంచిరి. ఇంత నెత్తురు కారినను, యింత బాధ కలిగినను ఎట్టి ముఖవికారము బొందక యున్నందులకు డాక్టరుగారెంతయో ఆశ్చర్యమునొంది, 'అమ్మా! పరమహంసవయ్యావా? పరమహంస అనేమాట పుస్తకాలలో చదివాను కాని యీవేళ ప్రత్యక్షంగా చూచాను. అమ్మా! యీ గోంగూర రాజ్యంలో ఎలావుండ గలుగుతావమ్మా?' అనుచూ ముమ్మార్లు అమ్మచుట్టును ప్రదక్షిణము చేసి నమస్కరించిరి.

## అన్నము తినజాల పోవుట

19 మార్చినుంచి సు రు 7½ సం॥ల కాలము అన్నము న వలనుపడ , అన్నము, అ న్నము అను పేరువ పరమాన్నము మినహా తక్కిన పిండి టలు, ండ్లు మొదల ఫలహారములు తినగలిగెడివారు.

ఒకనాడెవరో జున్ను తీసుకొనివచ్చి అమ్మకు పెట్టిరి. దానిని తినుచుండగా ఆ జున్నంతయు లోపలికి పోవు పుడు దానిలో కొంత పదార్థము లోపలికి పోకయుండెను. దానిని బయటకు సి పరిశీలించ అ అన్నపు మెతు కె యుండెను. అమ్మ అ న్నము నజాలని కా ణమున, యిట్లు న్నపుమెతుకైన, వారికి తెలియకు న్నను, లోప కుండ, వారి జీవితమును నడుపుచున్న శక్తి కాపాడుచుండెనని హింపనైనది. ఈ ఫలహారములు తీసుకొను రోజులలోకూడ కొద్దికాలము ఒక

నిమ్మ (పంచదార) తోన, సగము సోడానీరు మాత్రమే ఆహారముగ సరిపోయినదట.

శరీరమునకు అభిమానము వచ్చుట

1924 సం॥ ఆగస్టునెలలో నొకదినమున అమ కు తా నెరిగి బట్టలవర్తకుడు బొబ్బర్లంకలో తానున్న పా సమీపమున కాన్పించెను. దిసమొలతోనున్న స్త్రీని పురుషుడు చూచిన ఆమెకెంత అభిమానము కలుగునో, అమ్మకు అంత అభిమానము లిగి యింటిలోపలికి వెళ్ళిపోయిరి. ఆ క్షణము నుండి స్త్రీ పురుషు లెవరును తమను చూడకుండ చీకటింటనే యుం రి. రాత్రులందా నిర్భం ము లేదు.

ఆ కాలమున తాము ా చీకటి ట సూర కి ణము లెంత మాత్రము చొరరాకుండ, ప్పాలో నమేసి ం ములున్న, వానిని గుడ్డముక్కలతో ప్పి చెడివారు. చి నున్న మ యమున అన్నమే కావలయున, నీరే కావలయునో, మ మి కావలయునో తెలిసికొను తె వు లేదయ్యెను. నోట చెప్పుద మ ఆరు త ముల క్రిందటను డి ఆమెను మౌన ంచి యు ్నది. న ధ్వనిని వెలువ చుటకు శక ము కాదయ్యె.

చూ దమన్న చదువురా ఈ దశను ా చుటకై ల్లూరుపాలెం మునస గారగు సుఖవాసి యంగారు, మ్మ దీపపుకాంతిని కూడ భ పలేని సమ ము ఒ దీపము వెలిగించిరి. మం సానియెదుట స్త్రీ మా ము దాచుకోలేనటుల, ఆ దీపపువెలుగులో విధిలేక అమ్మ యి రులకు కన్పడక తప్పినదికాదు.

ఇట్లుండు కాలముననే అమ్మకు తాముకట్టుకొను బ విషయమై సందేహము కలుగ నారంభించినది. ఒంటిమీా బట్టకూడ (ఋణముతీరి) పోవునేమోాయని ఆమెకు భయము వేసినది. "ఏవిధముగానైనను బట్టమాత్రము పోకుండ కాపాడ వలెననుకొనిరి. ఒకవేళ పోయెడి పక్షములో బెజవాడవ ద్దరైల్వేబ్రిడ్జిపైనెక్కి, వరద నిండుగా వచ్చినపుడు కృష్ణానది మధ్యభాగములో బడి ప్రాణమునైన వదలెదగాని, యీా శరీరమును మాత్రము బయటపడనివ్వను. చనిపోయినప్పటికి శరీరమునితరులు చూడకూడద"ని గట్టిపట్టుదల పట్టియుండిరి.

ఇట్లు కొన్ని దినములు జరిగినతరువాత ఆమెయున యింటిలో కిరసనాయిలు దీపము పొగవేయు కారణముచే దా ని మాని ఆముదపుదీపము వెలిగించెడివారు. ఆ ఆముదపు ప్ర దయందెన్నడును ఒక్క రుగైనను చచ్చి పడియుండ లేదు. అమ ను చూచుటకు వచ్చెడివారు ఆ దీపపు లుగు , పెదవు ల గాని చేతులతోగాని అమ్మచేసెడి సైగలనుబట్టి విషయము లను హించుచుండెడివారు. ఒక విం విషయము. అమ చేయు సైగలు, చూడవచ్చిన వా కి కష్టములేక అ మ చు డెడివి. మన, అమ్మను మౌనము బం ంచి, చిక నిలిపినళ కి యే, ఆసైగల య మును లికగ తెలియ సెడి దని చెప్ప గును. ఈ విధము దీ కాలపు సంభాషణలు సైతము సాగుచు వి. అమ్మల ట్లు మున క మౌనము నెలకొనె ని చప్ప ల ను.

ఈ దశయందు అమ్మ ఎచటికయినా వెళ్ళవలసి వచ్చిన రాత్రులందే వెళ్ళెడివారు. ఇట్లు కి సంవత్సరముల కి మౌ

ములు గడచినవి. ఈ కాలములో వీరెక్కువగా నల్లూరుపాలెం, వివేకానందపురం (బొందలగరువు సమీపగ్రామము), బొబ్బర్లంక, గొర్రిగపూడి గ్రామములందుండెడివారు.

వివేకానంద రమున నుండుకాలము అమ యున్న గ హామునందొకనాడు జరి న ఘటన. ఒ ఎలుక పిల్లిదగ్గ కు పరుగెత్తుకొని వెళ్ళెడిది. ఆ పిల్లి దానిని నోట రచుకొని, దాని కన్నమువద్ద విడిచిపెట్టెడిది. ఈ విధముగా అమ యెదుటనే కొన్ని నిముసములవరకు ఆటలాడుకొని, తదుపరి దేనిదారినది వెళ్ళిపోయినవి. అవి యాటలాడుకొను సందర్భమున ఏమేని హింస జరుగునేమోయని అమ్మ భయపడెడివారు.

### అభిమానము పోవుట (దిగంబరి యగుట)

1 సం॥ వంబరునెల బొబ్బర్లం లోనున్న సమ యమున అమ్మకు నీ ము చ్చినది. ఈ నీరసము రా హార్యము కొలది ముల క్రిం నుండి అమ , 'మీకందరకు ట్ట లేవటు పించు చ ద' యను చుండెడివారు. ' యితే - బట్టలఖర్చు తప్పు తే'' యని పాములపా బుచ్చిరా డుగా దగ్గరను వారు నవ్వుచుండెడివారు.

పై నీరసము 1 ది ము కొనసాగినది. 13 వ దినమున పూర్తిగా సి చి స్పృహతప్పి పడియుండిరి. అమ్మ యున్న చీకటిగదిలోన అడ్డమును తీసివేసి, తలుపు కిటికీలను తెరచి, నిండారు ముసుగుతో పడియున్న అమ్మచుట్టును చేరి యున్నవారు, యిక అమ్మ జీవించునను యాశలేనివారై విచార

పడసాగిరి. కాని ఆ సమయమున అమ్మభావము ఒకస్థితి నను భవించుచుండెను. అప్పుడు ముగ్గురుస్త్రీలు (భక్తి, జ్ఞాన, వైరాగ్య శక్తులు) అమ్మను ముక్కోణముగ నమర్చిన స్తంభమునొద్దకు తీసుకొనిపోయిరి. ఆ స్తంభమునకు చివరివరకు మెట్లున్నవి. ఆ మెట్లవెంట అమ్మ నెక్కించుచు వీరును వెనువెంటనే వెళ్ళిరి. అమ్మ ఆ స్తంభపు పైభాగమునకు వెళ్ళగనే, వారిలో నొకరు చక్కిలిగింత పెట్టిరి. అమ్మ వులిక్కిపడి ఒక నిట్టూర్పు విడిచిరి.

ఈ కదలికతో దగ్గరనున్నవారందరు అమ్మ బ్రతికి యున్నదని తలంచిరి. అపుడు అమ్మలోని శక్తి బట్టముడి విప్పిచూడుమని పలికినది. వెంటనేవారు ముడివిప్పిరి. వారిని ముడివిప్పుమనిన శక్తియే అమ్మయై, బట్టను ఒకతన్ను తన్ని, దిగంబరియై బయటికివచ్చెను. మరల అమ్మనిస్సత్తుతో నడువ లేకపోయిరి. అంతట వారిని యింటి లోనికి కొనివచ్చి పరుండబెట్టిరి. దగ్గరనున్నవారు "అమ్మా! బట్ట కట్టుకోరా? యని బట్ట యియ్యగా, అమ్మలోని బట్టలేనిశక్తి "యిదివర కెప్పుడయినా బట్ట కట్టుకున్నానా, యిప్పుడు కట్టుకోవటానికి" అనెను. విచిత్రమేమనగా, అప్పటికి నలుబది దినములనుండి కట్టుకొన్న బట్ట అరవడికూడ ఆమె శరీరముపై క్షణములో మాయమైనది. తదాది వీరు దిగంబరి. కాని శీతోష్ణస్థితుల నుండి కాపాడుకొను నిమిత్తమొక బట్టను మాత్రము కప్పు కొనుచుండెడివారు. అప్పటినుండియు వీరు ఒంటి బట్టతోనే కాలము గడుపుచుండిరి.

## నీ ర స ము లు

సాధారణముగ అమ్మకు ఒక్కొకవృత్తి రహితమగునప్పుడెల్ల నీరసము కలుగుచుండును. నీరసమనగా, ఒ వగను ముక్కలు ముక్కలుగా నర , కరగబెట్టి, దానిరూపును మాపి వేయు తీరున, ఒక్కొక్కగుణము మా వేయుఅవ . ఈ సందర్భమున [ మైన వేద తో రమ తయు నలి పోయి, బ్రతుకునో లేఁ యనునంత భయముకలుగు .. కాళ్ళు, చేతులు వంకరలు రిగిపోవుట, వాటిని సరియైన తిలో నుంచుటకు దగ్గరనున్నవారి సా ధీనముకూడ కాకపోవుట జరుగును. కొంతవడికవి యథాస్థితికి వచు ను. తుదకు ఒకవృత్తి రహితమగును.

ఈ నీరసములలో మాయకును, జ్ఞానమునకును తీవ్రి సంభాషణ సంఘ ణ జరుగును. ఒకేవ్యక్తి ద్వివిధపాత్రల కనుగుణ్యము.. కం స్వ ములో నాటకమును చదువునపుడెటు ండునో, అటులనే యీ స భాషణకూడ.

ఈ సంఘర్షణయందు మాయ, తాను న ంచు నను భయముతో యేడ్చుటయు, జ్ఞానము నవ్వుటయు జరుగును. అంతమాత్రముననే ఆ గుణము విడిచిపోదు. కాని వానిలోని వైరాగ్యము బయల్వెడలిన వె టనే ఆ గుణము భయపడి, చేయునదేమియులే అమ ను విడిచిపోవును. అప్పుడాగుణ సంబంధమైన వృత్తియు - మగును.

ఒకవృత్తి రహితమైన తదుపరి అమ్మ ఎం యో లికగా నుండెడివారు. పాము, కుబుసము విడిచిన తదుపరి చురుకుగా,

తేలికగా, వుత్సాహముగా నుండునటుల, మాకుండెడిదని అమ్మ చెప్పెడివారు.

భర్త భావము రహిత మైనపుడు గొరిగపూడి నుండి బొబ్బర్లంకకు (10 మైళ్ళ దూరము) ఉదయము కొలదికాలము లోనే వెళ్ళి, మరల సాయంకాలము అదేకాలములో తిరిగి వచ్చెడివారు. రైలులో ప్రయాణము చేయునపుడు ప్రక్కనున్న చెట్లు వెనుకకు పరుగిడునట్లుండునో, అటులనే వీరు నడచి వెళ్ళునపుడు త్రో ప్రక్కన చెట్లు అట్లు కనుపించెడివట.

ఇటులోకవృత్తి రహితమైనపుడెల్ల అమ్మ ఎంతో ఉత్సాహముగా, చురుకుగా నుండెడివారు.

## తలబోడి

అమ్మ మా—లుగా కొప్పుపెట్టుకొని యుండెడివారు, ఒకనాడు 'అదేమిటే' అని కొప్పును చూపించినది లోపలిశక్తి, అంతట ప్పు వుంచుకొనుట ఎంతోతప్పుగా తోచి, కొప్పుతీ ముడిగా నుంచుకొనిరి. తదుపరి, 'ఊ! బోగందానిలాగ బాగా వుందిలేముడి' అని ఆశక్తిమరల అనుసరికి ఆ ముడికూడ ంచు కొనుటకు వీలులేక వెంట్రుకలు విరియబోసుకొనవలసి వచ్చినది. అమ్మ వెంట్రుకలు చా నిడివిగా నిగ నిగలాడుచు నుండెడివి. "అంతాచూచారులే! బాగానేవున్నాయి అందంగా, బారుగా," అని మరల హెచ్చరికరాగా అటులకూడ జు వుంచుకొనుటకు వీలులేకపోయినది. అంత అమ్మలోనిమాయ, 'అయోం! బో నయే దా! బోడినయే దా!" యనుచు యేడ్వ నారం ంచిన . కొంతవడి యేడ్చి ్ర, "యింకచేసేదేముంది? జుట్టు కత్తి

రించండి," అని అమ్మ అనిరి. తప్పనిసరియయి వెంట్రుకలను కత్తిరించిరి. తదాది అంత్యదశవరకు బోడితలతోనే యుండుట జరిగినది.

విధిపూర్వకమగు జ్ఞానుల యిట్టినడకను చూచి తలబోడి చేయించు కొన్ననే మోక్షప్రాప్తని భ్రమసి కొందరు ఏ తత్కార్య క్రమమునకు పూనుకొని వ్యవహరించుచున్నారు. "తలలు బోడులయిన తలపులు బోడులా" యని అవినాడు వేమన.

మల విసర్జనము

అమ్మ గోరిగపూడి చెరువుగట్టు పైనుండగా జరిగినది.

సీ. మాతయు ఒకనాడు మామూలు ప్రకారము
బాహ్యభూమికి తాను బయలుదేరి
మలమును విడిచియు మగిడి వచ్చుచునుండ
శబ్దంబు యేదియో చెవులబడియె
"ఎవరికోస మటుల ఏకారణంబుచే
మలము విడిచితీవు మరుగులేక
గతమునందున అట్టి కర్మ చేసియెకదా
పందివై పుట్టియు పాట్లుబడుట
అందుల కాజన్మ అది పొందిన దుష్
కర కర్మకే నీవును కావె ఏ ది?"

తే. అనెడి విం తైనమాటలు నాలకించ
ఝల్లుమనియెను గుండెలు చల్లబడియె
అన్నమును పెట్టవలసిన ఆకుయందు
మలము పెట్టుచునున్నట్లు మదికితోచ
పూడ్చిపెట్టుట మొదలిడె పూర్ణమతిని.

తే. అన్ని జీవు కు సమాన మాకలిలను
కాని చేతయేగీత యనునది సత్య
మనుచు, తెలిసికొనియు కూడ మనదుమలము
విడచుచుండుట పందికి చెడుగుగాదె.

క . ఎవ్వరైనను యనవచ్చును
"అవిచేసిన ర్మవల్ల అట్టుల పుట్టెన్"
అవునామరి, కనుమిక, మన
జీవితమును అటులకాదె, చెపుమానీవే.

తే. వెండి బంగారమైనను విడువవచ్చు
దాచియుంచంగ లేనప్డు యెచ్చటయిన
అందువలనను పాపంబు రాదుమనకు
కాని మలమునుమాత్రము కానకుండ
పూడ్చిపెట్టంగ వలయును భూమియందు.

శాంతి ఆశ్రమములో

1928 సం॥ నేన . శాంతి ఆశ్రమములోయున్న తత్వా నందస్వామిని జూచు ం ల్పముగలిగి అమ అచటకు వెళ్ళిరి. స్నానాదులు జరిగిన తదుపరి అమ్మ ఒక చెట్టునీడను పరుండి

యుండిరి. అపుడు శ్రీ ఓంకారస్వాములవారు అమ్మతో సంభాషించ నచటికివచ్చిరి. సంభాషణలో పాల్గొనుచు, చేతితో ఆ యాకును ఈ యాకును యిటునటు పడవేయుచుండిరి. 'అటులచేయుట మంచిదికాదు. అవయవముల మీదికి మనసును విచ్చలవిడిగా పోనీయతగదని' అమ్మ అనిరి.

'అంతమాత్రముతో సేగిలేదు. మనస్సు చెదరిపోదు' అని స్వాములవారనిరి.

'ఉన్నమనసు ఒక్కటే. ఒకేకాలమందు అది రెండు మూడుపనులు చేయజాలదు. అది నీహద్దులోనుండి ఎప్పుడైనను ఒకేపనిలో నిలువవలెనుగాని, యిచ్చవచ్చినట్లు రెండు మూడు పనులమీదికి పోరాదు. అటుల పోనీకుము. ఆ ఆకులను [illegible] పడవేయుము'ని అమ్మ చెపిరి. స్వాములవారటులనే చేసిరి. తదుపరి మరికొంత సంభాషణ జరిగినది.

నాలుగైదు దినములయిన పిమ్మట స్వాములవారికి [illegible] పోటుమెరక ప్రాంతములవారు, తమ యెడబాటు [illegible] పడుచున్నట్లు మనసుకుతోచ, మరలిపోవలెనని అమ్మ [illegible]. అప్పటికే అమ్మయెడ భక్త్యనురాగము [illegible] ఓంకారస్వాములవారికా యెడబాటు దుస్సహమై [illegible] వెడలుసంకల్పము [illegible]యలదని అమ్మను ప్రతిమాలి [illegible] కోర్కపై అమ్మ ఆరుదినములు మాత్రముంచిరి. [illegible] దినమున ప్రయాణము స్థిరమయినది. శ్రీ స్వాములవారు [illegible] కుటీరపు నేలకొట్టులోనుండి వెలుపలికి రాకుండిరి. ఎండలు [illegible] నను తలుపుతీయరు. వారికి తమపయనమును [illegible] వెడల

వలెనని అమ్మసంకల్పము. తుదిని అమ్మయే స్వయముగ వెళ్ళి తలుపుతట్టగా తట్టగా స్వామి కుటీరపు తలుపు తెరచి నేలకొట్టు లోనికి తిరిగిపోయి విచారముతో కూర్చుండిరి. అమ్మపోయి చూచునప్పటికి శ్రీ స్వాములవారి కండ్లుబ్బి యున్నవి. వారి విచారము అమ హృదయమును కలంచివేసినది. కాని పయన మాప వీలులేకపోయెను. చాలసేపు బ్రతిమాలి మార్గాంతరము లేక అమ్మవచ్చివేసిరి.

అమ్మ శ్రీ శాంతి ఆశ్రమమునందున్నపుడు జరిగిన ఒకటి రెండు ముఖ సంఘటనలు. ఒకనాడుదయముననే అమ తతా నందస్వామి ఉన్న కుటీరముకడకు వెళ్ళి, 'బాబూ! నేడు ది చర్యను పాపకారముతో ప్రారంభించితివా' అనియడిగిరి అప్పుడే నవనవలాడు నేరేడుమండతో పండ్లుతోముకొనుచున్న స్వామి, యీ మాట అ ముకాశ, భీతిలి, 'ఏమి పాపమ'ని. 'నిన్ను గిల్లిన నీకునొప్పి దా! ఆ పుల్లను విరిచినప్పుడు చెట్టు నకు నొప్పిలేదా?' అని అమ్మ అనిరి. అంతట స్వామి, 'ఔనమ్మా! చెట్లకును రసనాళములు, నరజాలము యున్నదని చదివియుంటిని. చెట్లకును సుఖ దుఃఖము లున్నవట' అని చెప్పిరి. "ఆమాట చదివి లాభమేమి? పుట్టెడు చదువుకన్న చిట్టెడు ఆచరణమేలని" చెప్పిరి అమ్మ.

సవికల్ప నిర్వికల్ప సమాధులందు గలుగు అనుభూతు లనుగురించి వ్రాయబడిన ఆంగ్లగ్రంథము నొకదానిని ఓంకార స్వాములవారనువదించిరి. 'నేనొక గ్రంథమును వ్రాసినాను. చదువుదును. వినుమ''ని అమ్మకడ చదువనారంభించిరి. కొన్ని మాటలు చదువగనే, 'ఆ మాటలు నీవైనావా? అది అను

భవమేనా?' అని అమ్మ అడిగిరి. 'లేదు' అరి స్వామి. "ఆపుస్తకమును బీరువాలోపెట్టి తాళము వేసియుంచు. నీవా మాటల రూపమైనపిదప బైటపెట్టు" అని చెప్పిరి అమ్మ.

## గాంధీజీతో

గాంధీ ఆంధ్రదేశ సంచారముచేయుచు 1929 ఏప్రిల్ 19 న రేపల్లెవచ్చిరి. కొందరుమిత్రులు అమ్మను గాంధికడకు తీసుకొనివచ్చిరి. అమ్మ వారికెదుట కూర్చుండె. అమ్మను మౌన మావహించియుండెను గాని మది. . గలల ప్రసంగము నారంభించిరి. ఆ సైగగ్రహింప గలవా, ఇంగ్లీషుభాష తెలిసినవారు, ఉభయుల భాషణములను అనువదించు చుండిరి. 'సత్యము, శాంతము, అహింస, అపరిగ్రహము మొదలగు గుణములు మీయందున్నవని చెప్పుకొందురు. ఆ మాటవిని చూడవచ్చినాము'ని అమ్మ అనిరి.

'లేవు, లే . అలాంటి గుణాలేవీ లే . ఈ తీరుగా రాట్నంవడకుచు, తొందరలు లేకుండ రుండినపుడు అటులనే తోచును. కు నిజము తెలియవలయునంటే, మా ఆశ్రమమునకువచ్చి చూచిన తెలియును. ఆశ్రమములో నాకు ంతియుండదు. ఇప్పుడును మిమ్ముచూస్తుంటే ముచ్చటే స్తున్నది. వలదను దిని ఆ కిటికి లోనుండి తొంగిచూచుచు తొక్కిసలా ప్రజలను చూస్తుంటే రాళ్ళుపెట్టి కొట్ట బుద్ధి పుట్టుచుండును" అనుచు రాట్నము డుకుచునే యుండిరి గాంధీజీ.

"సరే, వడుకు వడుకు" అని అమ్మ అనిరి.

"ఓ! నేను దీనిని ఆపరేషను చేసినప్పుడుకూడ విడిచి పెట్టలేదు. వడుకుతూనే యుంటిని" అని గాంధీజీ పలికిరి.

"నువ్వు విడిచిపెట్టటం కాదునాయనా! అదే నిన్ను విడిచిపెట్టాలి" అని అమ్మ చెప్పిరి.

"బస్, బస్" యనుచు గాంధీజీ చాల సంతసించి, 'అవును, అది నన్ను విడిచిపెట్టువరకు వడకెద'ననిరి.

తనభాము న ము చేసికొని నందులకు అమ్మకూడ ఎంతయో నానందించుచు, 'నాయనా! అ మయిందా?' అనుచు ప్రేమతో వారిగడ్డమును తాకబోయిరి.

గాంధీజీ వడకుటమాని అమ్మ హస్తములను తన చేతులతో పట్టుకొని, సంతోషముతో, 'మీరు తాకుటకును నేను అర్హుడనా?' అనెను. మరియు, 'మరొకసారి కనుపింతురా?' అనుచు వీడ్కొలిపినారు.

'సరేన'ని అమ్మ అటనుండి బయలుదేరి, కార్యక్రమము ప్రకారము ఆ సాయంకాలమే, గాంధీ ల్లూరుపాలెం వచ్చు టి ముందే అచ కిజేరి, గాంధీజీ నల్లూరుపాలెం వెళ్ళి, తము న్నముందుగనే అమ్మ చ్చి కనబడుటచూచి ఎంతయో ం ంచిరి. హ జన నిధికి కాను వసూలు చేయవచ్చిన మ త్ముడు, కానుకను గ హించి ప జలనుద్దే ంచి, 'ఇక్కడ యిద్దగు మహా క్తులు (చిన్నమ్మ, పెద్దమ్మ) కలరు. వారు చెపి టుల ప వర్తించుడు. ద్దరు ధరించుడు. కల్లుమానుడు. స్ అని సైగ చేయగా, వా కారు బజ్జున వెడలి పోయినది.

ఆ పిమ్మట నొకరితో గాంధీ, అమ్మ తనను తాకినప్పటి నుండి తనలో నొక పరివర్తనము ఘటిల్లెనని చెప్పినటుల విందుము.

తన ఆశ్రమమునకు వెళ్ళిన తదుపరి అప్పటి తన యంగ్ యిండియా పత్రికలో అమ నుగురించి నుల్లేఖించుచు యిటుల వ్రాసిరట- 'నాకామె చిన్నమ్మ) జ్ఞాపకము వస్తున్నపు డెల్లా ఎంతో ఆనందం కలుగుతూవుంది.'

గాంధీజీతో మాట్లాడిన కొద్దికాలమునకే, 'గాంధీలో మంచిగుణాలుంటే గాంధీకేవుంటాయి. మాలపల్లిలోని కటిక వాడికి దుర్గుణాలుంటే, అవి వాడికే వుంటాయి. నీ కెందుకే పక్షపాతి?' అని లోనుంచి హెచ్చ క చ్చుస 933 లో మరల గాంధి ఆం దేశమునకు వచ్చినపుడు చూడవలెనని యున్నను అమ్మ వె ళ్ళలేకపోయిరి. గాంధినేకాదు, అప్పటిలో తన్నెక్కుడుగా ననుసరించుచు యలవర్తి వెంకయ్యగారికి జబ్బుచేయ, వారిని చూడవలె నెడి యభిలాష యున్నను, అచటికికూడ వెళ్ళలే పోయి .

1 48 ఫిబ్రవరి 1 వ తేది. దే మంతయు గాంధీజీకి శ్రద్ధాంజలు లర్పించుచున్నది. అమ యనుచరులుకూడ గాంధీ పేర క్ర కా డ జరిపి, అమ్మకాహారమిడిరి. వారు ఆహారము తీసుకొనుచుండ గాంధిరూపు, వారికి తగిలిన గుండ్లగాయములు కనుపించి కంటతడిపెట్టిరి. తదుపరి అమ్మయనుచరులు భోజ నములకు కూర్చుని మామూలు ప్రకా ము వంటపదార్థములను ప్రసాదముగా చూడమనిరి అమ్మను. అటుఅవాటిని ప్రసా దముగ చూచునపుడు అమ్మ గాంధిరూపువలె నుపించిరి.

'మీకందరకు ఉప్పు తెచ్చిపెట్టా ^. అందుకయినా వాడు చెప్పినట్లు ఖద్దరుకట్టుకోండ'ని తన యనుచరులకు చెప్పుచు వారు చివరవరకు ఖద్దరు నేవాడిరి. వీలయినపుడు దాసులకు దాసియై రాట్నము వడకిరి.

అ హిం స

గొరిగపూడి గ్రామమందలి చెరువుగట్టుపై అమ్మ బస చేసియుండగా, సూర్యునిలోనుండి ఒకవుత్తరము వచ్చినదట. దానిని ఒకకాకి యిటుల చదివినదట—

' నుజుల పాపము బా ను
భూమిమీద పుట్టి పువ్వార తులసీ!'
ఇది అమ్మకుకాన్పించి చెప్పినవిషయము.

ఆ మరునాడుదయము కొంతమంది హ రి జ ను లా చెరువులో చేపలుపట్టుటకై వ ి రి. ఆ క్రితమురోజు వరకు ఎవరెక్కడ చేపలుపట్టినా వూరకున్నవ క్తి యీనాడు వారు రాగానే వెళ్ళి, అమాంతముగా మీద డి, చేపలుపట్టకుండా యడ్డగించిరి. ఆనాటినుంచి అచట చేపలుపట్టుట ఆగిపోయినది, అమ్మ అచట వున్నంతవరకు. ఈ విధముగా వారు తిరి న చోట్లల్లా ఎచట హింసజరుగుతున్నా వారికి నచ్చజెప్పి, బ్రతిమ లాడి, వారి నాహింసాకాండనుంచి త ప్పించిరి.

అమ అచ వున్న కాలములో ఆ చెరువులోని చేపలు అమ్మనుచూ చ తయో నానందముతో అన్నియు నీటిపై వచ్చె వి. అమ్మ టిలో చేయిపె న ఆచేతిని చుట్టుకొనెడివి.

ఈ సంగతి తెలిసి కొందరు, 'అమ్మా మీరు రాగానే చేపలన్నీ నీటిపైకివచ్చునట. మాకు చూపిస్తారా అని యడిగి, 'ఆ, చూపిస్తాను' అనిపలి చెరువువద్దకు వెళ్ళిరి. కా ఒ కూడ బయటకురాలేదు. తమమాట అసత మయినందుకు అమ్మ ఎంతగనో యేడ్చిరి. "ఇంక ఎప్పుడూ యిలాంటిమాటలు అనవు గదా!" అనిలోపలిశక్తి హెచ్చ ంచినది. తదుపరి చేపల్నయు బయటకువచ్చి కనుపించినవి.

ఇట్లుండుకాలమున ఆదారినిపో ఒ ల్లెమనిషికి ఒక నాడు ఆ చేపలుయేడ్చుట ను ంచి, " ందు మ్మా! చేపలలా ఏడుస్తున్నాయి?" అని అమ్మ డిగెను. " మా!" అ అమ్మ జవాబిచ్చి . మరునాడు కొందరు ఆ చెరువుకట్టపైనున్న తాడి చెట్ల ఆకులు కొట్టుచుండగా, అందొ పా కాను ంచ, దానిని నిప్పుమంటవే చ . ఇక యిట్టి హి జ గే చోట నుండ రాదని అమ్మ అ టనుండి వె ళ్ళిపోయిరి.

అమ్మ అచటవు న్నకాలములో అమ్మనుచూచి పైకి వచ్చెడి ప ను చూచి 'నిటి యిన్ని చేపలు కానుపించు చున్నవి, లొ పల ఎన్నివున్నవ దా'య ఆ సమీ మువారు ఆ సంవత్సర ఎక్కువగా పాటపాడి వరకు మో. యి.

ష్ణా ల్లా విశ నాథ గ్రామమున అ చ గల

చా మ్మ దేవ పే ప వ రము జాత జరుగుచుండును. అచట కొన్నివేల పా బ గాబడుచుండెడివి. 193 లో లోపలివాణి (శక్తి ప్రేరణపై అచటి హింసాకాండను వారింప అమ్మయు, మరికొందరును విశ్వనాథపల్లికి బయలు దేరిరి. మార్గమధ్యమున అనేకులు మేకలను, గొఱ్ఱెలను, కోళ్ళను,

యితర జీవులను తీసుకొనిపోవుచుండుట వారికి గోచరించిన . నిరపరాధులగు ఆ దీనజంతువుల యరపులు చెవినిబడి అమ్మ హృదయము కారుణ పూరితమై కల్లోల పడసాగినది. గుడి యింక కొంతదూర న్నదనగనే అచట నొక సత్రమునందు దుః ముతో నుండిపోయిరి. ఇది తెలిసినవారును, అమ్మననుస రించి వెళ్ళినవారును అమ్మనుగురించియు, అహింసాధర్మమును గురించియు చెప్పి, హింసజరుగకుండ అందరిని పంపివేసిరి.

బొబ్బర్ల కృష్ణానది పక్క గా మము రేపల్లె తాలూకా). వసవి కాలము. అపుడు అమ ఆచటనే యు డిరి. అచటిచెరువు ఎండిపోవు సమయమున అందులోని చే లను కాగులు, కాయిలలోని కెత్తించి, కృష్ణానదిలో పడవేయించిరి. ఆ సందర ములో చచ్చిపడియున్న చేపలను గ్రిదలు, కొంగలువ గెరా వియుకూడ ముట్టలేదు. మానవులే గా , మాంసాహారమును తిను యితరజీవులు (పక్షులు ను అహింసాధర్మము నవలంబించుటచూచి ఆశ్చర్యచకితులై రి.

జీవి హింస జరుగబోవు చు న్నను అమ ప్రాణము గిల లా కొట్టుకొనెడిది. సుమారు మైలుదూరములో చేపలు పట్టుచున్నను, అన్నుభావమునకు న్పించి, వె టనే అచట ప గెత్తుకొనివె , వారి నాకా ్యమును డి వారించి, ఆ జీవుల పా ణముల. .. పాడిరి.

చేపలుపట్టువారి నడ్డగించుటయే గాక చివర చివరకు అమాంతముగా వెళ్ళి వారిమావులను తు నియలు చేయుట వలలను ఛించుట జరుగుచూవచ్చినది. ఒకనాడిటులనే ఒ వలను

చించివేయుచుండగా, 'చీల్చవే దీనిపీపు, చంపేదానిని హింసా భావమును) చంపవలెగాని, వలలు చీల్చటందేనికి?' అని లోని శక్తి ప్రశ్నించుసరికి, అటులచేయుటమాని వేసి, హింసాహారము వల్ల వచ్చేదినష్టమును గురించి చెప్పెడివారు.

'చూడునాయనా! మనకాలిలో ఏదైనా గుచ్చుకుంటే ఎంతో లబల లాడ్తాం. అదికూడ మనలాంటిజీవే. రక్త మాంసాదు లున్నాయి. కర్మనుబట్టి ఆ శరీ ం కట్టుకొచ్చిందది. ఇ డు మనం దానిని చంపితే మ ్ ఆకర అ భవి చటానికి ఆ జన్మ ఎత్త లసివస్తుంది. మన పట్టుం బోతు పే చూడు, అది ఎలా గిలగిల కొట్టుకుంటుందో'

వినయా మ ుంలో నుండగా జరి ఘట .

తే. పుండుయొక్కటి లే యు పోటుపెట్ట
మట్టిపాలను పట్టించ మంచి నగ
ఆకులను త్రుంచజా అమ్మయపుడు
ప్రక్కనున్నట్టి వారితో పలికె నిటుల.

తే. "మట్టిపాలు కావలయును మాన్పపుండు
గాటువేతురె మీరలు కోడ?"
అంతవారలు ఒకచెట్టు చెం జేరి
గాట్లు మూడటువేయంగ గట్టిగాను
పలికె నావృక్షమిటు జాలికలుగునట్లు.

ఆ. 'ఒక్క పుండుబాధ నోర్చుకోలేకను
ఇన్నిగాట్లు నాకు నేలపెట్ట?'
అనుచు వృక్షమట్లు అనుటయే తడవుగా
'వలదు పాలటంచు' పలికెనమ్మ.

అమ్మ బొబ్బర్లంకగ్రామములో నున్నప్పుడొక కుక్క అమ్మసాంగత్యమున నుండెడిది. అది యొకనాడు మాంసము తినబోవ అమ్మచూచి, 'బూసీ! అలా మాంసంతినవచ్చా? తప్పుకాదా?' అని యనుసరికి తన తప్పిదమును గు_ర్తిం ి, మాంసముతినుట మానివేసి వచ్చినది. కొంత కాలమయిన తదుపరి అమ్మ మరియొక యూరువె ్ళి కొన్నిదినములు ది వచ్చుసరికి, యీకుక్క తోడికు ్కలతో క సి మాంసముతిను అమ్మచూచి, 'బూసీ! చెడిఎ తివా?' అని . అంతటది అమ్మ వద్దకు రాలేక, దూరముగా తిరుగుచు, సరిగా తిండి నక, శుష్కించ మొదలిడినది. ఈ పరిస్థి నెరిగినవారు, '_మా ! చూడండమ్మా. లా చిక్కిపోత్రోందో! మీరన్నా పిలవ డమ్మా! దగ్గరకువచి కా_అన్నము తింటుందేమో! 'అని యనిరి. అప్పుడు అమ , 'ఊ! చాల్లే, రా. వ అన్నంతిను. ఇంకెప్పుడూ అలాంటిపనులు చేయకని' యనిరి. అప్పటినుండి దగ్గరకువచ్చి అన్నముతినుచు బాగుగ నుండినది.

అమ్మ సాంగత్యములో యితరజీవులే మాంసాహారమును మానియుండ యింక మానవులసంగతి చెప్పవలెనా! అమ అహింసాప్రబోధము వల చాలమంది, ముఖ్యముగా కృష్ణా, గుంటూరుజిల్లాలలో, మాం సాహారులు శాఖాహారు లయినారన అతిశయోక్తి యేమాత్రమును లేదు.

అమ్మకు ఆహారము భిక్ష పెట్టుకునే సందర్భము మాంసాహారులు వండిన ర్థము పై తిన వలనుపడెడిది కాదు. (ఊదర న పండ్లును, బెల్లమును వంటపదార్థములే) వారేదై పండు పెట్టవలసినదే. ఒక పర్యాయమొకరు

(హింసాహారులు వంటపదార్థము సుకొనివచ్చి అమ్మకు పెట్టిరి. మామూలుగా దానిని నోటియందుంచుకొనగా, లోనికి పోనివ్వకుండ అంకిలి పట్టివేసినది. బయటకు వదలనూలేదు. నోటిలోనే యుండుటవలన సరిగా అర్థముకానిధ్వనితో, "మాంసము తింటావా?" యని అడిగిరి. వారు తిందుమనిచెప్పిరి. వెంటనే ఆ పదార్థమును బయటకు వదలివేసి, నోరు శుభ్రముగా కడుగుకొని, వారివద్ద పండుతీసికొని, తదుప మిగతావారి భిక్షతీసుకొనిరి. కొన్నిపర్యాయ మిటులనే జరిగినది. హింసాహారులవగ వంటపదార్థమును పొరపాటున తీసుకొనుట జరిగినను, లోని శక్తి యీ విధముగా అడ్డగించెడిది.

అమ్మవద్ద కెవరయి హింసాహారులు వచ్చిన, అచట జరుగువంట పనులలో వీరుపాల్గొన నుపడెడివారుకాదు. వారి నటుల దూరముగనుంచి మిగతవారు వంటచేసి వారికిడుచుండెడివారు. హింసాహారము మును విసర్జించి వత్సరము గడచిన తదువరి వారిడిన పదార్థము తీసుకొన గలిగెడివారు.

వస్త్రదానము —

తే. ఒకట ఆశ్రమమందున ఒక్కసారి
అన్నదాన బు రుగుచు నున్నయపుడు
సాధులందరం జక్కగా సత్కరించ
దలచి వారలమ్మను గూడ బిలిచినారు.

తే. నూత్న వస్త్రాలతోడను సత్కరించ
స్వీకరించిరి సాధువుల్ వేడ్క మీర

కాని యీామాత మాత్రము గాక యటుల
వలదు, వలదంచు పలికెను వారితోడ.

తే, ఇట్లులనుటకు కారణంబేమి యగునొ
యంచువారలు ఎంతయు కించపడిరి
అసలుసంగతి అరయుట కదను కాక
మిన్నకుండిరి అంతట తెన్నులేక.

తే, రెండు మూడు దినంబు లిట్లుండినంత
ముఖ్యులందరు కూడియు ముదము తోడ
అమ్మవద్దకు వచ్చియు అడిగిరిట్లు
"హేతువేమమ్మ మమ్మిట్లు హీన రచ?"

తే. "మీారు వస్త్రములిచ్చుట మేలొ ఏమొ
కాని మాకెట్లు ఒగిపోనొ కానరాదు
ఇప్పుడున్నట్టి వస్త్రంబు ఏమిచేసి
స్వీకరించు మటందురో చెపుడుమీరు.

సీ. ఒంటిపై నొకబట్ట ఒనరంగ నుండగ
ఈ బట్టగైకొని ఏమిసేతు?
అట్టిపెట్టుదమన్న పెట్టెమియే లేదు
వట్టి చేతులతోడ ట్టుదాతు?
మోసితెచ్చుటకును దా యైనను లేదు
నానెత్తిపై దీని నట్లుమోతు?
ఆధారమేలే అచ్చటచ్చట తిర్గు
నాకిట్టి దానంబు న్యాయమగునె?

తే. చెంతయున్నట్టి వస్త్రంబు చిరుగుదనుక
వేచియుండియు, దాని దాచియుంచి
మీారలప్పుడు యిచ్చిన మేలెయగును
అవునో, మరికాదో, మీరలె అరయుడయం'

కం. ఇది విని రలు మిక్కిలి
మదిలోనను సిగ్గుజెంది మగిడిరి, తమలో
'పదుడిక పోదము మనకిట
నిదియే తగినట్టి శాస్తి ఎంతయు ననుచున్'

పెద్దమ్మను పరమాత్మగా చూచుట

నాగాయితిప్పదగ్గర మామిడితోటలో నుండగా జరిగిన సంఘటన. ఒకనాడు అమ్మకు తమలోనుండి ఒకశబ్దము విని పించినది– 'ఇదివరకు నీలో ఏభావమునకు పరమాత్మ కనుపించి నదో, ఆ భావముతో పెద్దమ్మను 12 రోజులు నామ రూపములు కనుపించకుండ పరమాత్మగా చూడుము'–అని. అట్లే 3 రోజులు నామ రూపములులేక పరమాత గా కనబడుచు నాల్గవరోజున పెద్దమ్మ నామ రూపములు క ్పించినవి. అట్లు కాన్పించుట అసత్య ని అమ యేడ గా, లోపలిశక్తి 'ఒక తప్పులే' అని మన్నిం నును. మర 3 జులు నామ రూపములులేక నాల్గవ రోజు ఉదయము గం.కు పెద్దమ్మ నామరూపములు కనుపించగా అమ్మ ఆ అసత మునకు చావుకు సిద్ధపడి తల బ్రద్దలుకొట్టు కొను సమయమున, అది చూచి వారు అట్లు కొట్టుకొననీయక పట్టుకొనిరి.

అప్పుడచ్చటికి చాలమంది చేరి . ఆ సమయమున ఆ తోటలో కాయలుండుట లన, అమ్మ శక్తి 'ఈ కాయలు

ఎవరైనను త్రుంచిన నీదే బాధ్యత' అని అమ్మకు తెలుప కావలి కాయలేక అచటినుండి బయలుదేరి కోసూరు సోమయ్య (కోసూరుపాలెం) గారి మామిడిచెట్టు నీడకు వెళ్ళిరి.

సాయంత్రం 3 గం.ల వరకు అమ్మను పట్టుకొనియే యుండిరి. ఇట్లుండగా అమ్మలో 'కేసువిచారణ' అని వినిపించగానే ఆ ఏడ్పు మానినది. అంతట 4 గం.లకు కరంనేని శ్రీరామమ్మ యనునామె వచ్చి, 'అమ్మా!' అని పిలువగా, 'మీ అమ్మ అసత్యమైనదని' అమ్మ అనుట సిద్ధపడిరి. అంతలోనే, 'అసత్యమైనదా? 12 రోజులు కావలి కాయమంటివి. కావలి కాయగలిగితే కాస్తాను. లేకపోతే లేదు. అంతేగాని కావలి కాస్తానని మేము ఒప్పుకొంటిమా?' అని అమ్మకు తమలోనుండి జవాబువచ్చినది. అపుడు అమ్మ, తాము అసత్యము కాలేదని సంతోషపడిరి.

మరల 3 రోజులు పెద్దమ్మ నామ రూపములు కానుపించక నాలవరోజు ఉదయం 6 గం.లకు మనసులో నామ రూపములు కనుపించినవి. 'మేము చెపినట్లు మా అదుపులో నుండక, కావలికాయగలిగితే కాస్తానని అంటావా? పట్టుకొనవే సాయంకాలం 7 గం.ల వరకు, నామ రూపకమైన ప్రపంచము కనుపించకుండ పరమాత్మ భావముగానే' అని కట్టివేసినదా శక్తి. 7 గంటల తదుపరి ఆపట్టు విడిచిపెట్టినది. అపుడు అమ్మ శరీరము ఇటుక ఆవ గణ గణ కాలునట్లు కాలుచుండెను. నామ రూపములు చేయుఎరుక పడలేని బాధపడుచుండె.

ఇది యిండ "అంతాపరమాత్మ" అనువామాట ఎంత సతమో యోచించి చూడుడు. సూర్యుని యెదుట

చీకటిని ఎట్లు దర్శించలేమో, అంతాప మాత అ ైపెరుక సత్యమైనచో నామరూప ప్రపంచము కనుపించనే నుపించదు.

ఐక్యమగుట

ఇలువీడిన తదుపరి కొంతకాలమువరకు అమ కాశ్రయ మిచ్చినవారిలో ము లు శీ సుఖవాసి నా శే ల్లె తాలూకా నల్లూరుపాలెం గ్రామమునస గారు. కే లము వీరేగాక వీరి కుటుంబము, వీరి మరదలుగా కుటుంబము-పిల్లలతోసహా-చాలకాలము అమ్మసేవలో గడపిరి. వీరిలో రంగమ్మ (ము సబుగారి భార్య) గారు అమ యెడ విశేష శ్రద్ధాభక్తులతో నుండెడిది.

9 4 లో రంగమ్మగారి పెద్ద జబ్బుచేసి తీవ్రరూపము దా ,నది. అదే మయములో అమ్మ చెరుకుపల్లిగ్రామములో నుండిరి. ఒకనా రా తి రంగమ్మగారు చ్చి కౌగలించుకొని తనలో కల పోయి ట్లును, ఆ మరుక్షణమే తామారూపయి నట్లును, తమము ముపై స్ఫోట మచ లున్నట్లును ను పించినది. ( ంగమ్మగా లోగడ స్ఫోట ము వచ్చినది. "ఏమిటా యిలా ంద"న అనిపించినది అమ్మకు. ఆ రాత్రి రంగమ్మగారు గతి చిరని మరునాడు వార్తవచ్చినది.

భగవంతు లో భక్తులు లీనమగుట యనయిట్టిదేయని అమ్మ అనెడివారు. జ్ఞానితోపాటు భక్తుల వృత్తులు కూడ హితమై వారుకూడ శా తాన ద స్థితిని డయగలరని చెప్పెడివారు. అటుల లీనమైపయి ఆ భక్తు లెం ట ధన్యులోకదా!

## వ్యాసాశ్రమములో

అమ్మ వ్యాసాశ్రమములోనుండగా జ గిన కొన్ని ముఖ సంఘటనలు 1936).

చవకప్రయాణపు రైలుటిక్కెట్లు యే ర్పా టు మీా ద కొందరు ప్రయాణముచేయుచు వ్యాసాశ్రమము వె ిరి. అందులో నొకరు మిగతాదినములకు అమ్మనుగూడ తీసుక పోవుటకును, అమ్మకు భిక్షపెట్టుకొను చుండుటకును ఒడంబడి దిరూపా యలుపెట్టి అమ్మకై టిక్కెటుకొనిరి. ఆ ప్రయాణీకులతోపాటు అమ్మయు వెళి రి. ప్రయాణపుదినములు ముగియక మును పే అంద ను తి వ్యాసాశ్రమమునకు వచ్చి అమ్మ నక్కడ విడ రి. అప్పటకి లెక్కచూడగా అమ్మకైకొన్న టిక్కెటు మూ ములో ఆరురూపాయలు నిలువయున్నటుల లె క్క తేల్చిరి. ఆ వి వను టిక్కెటు కొన్నవారి కిచ్చివేయవల ననియు, అందుకై తామిచ్చటనుండు దినములలో భిక్షపెట్ట నిచ్చగించు వారికి తానమ్మడుపోదుననియు, ఎవరిష్టమువచ్చి ంత వారు పావలాయో, అణాయో యిచ్చి కొనుక్కొన చ్చుననియు చె రి. అటులనే అచటనున్నవారు వారి వారికి తోచినటుల డ నిచ్చిరి. శ్రీ మ యాళ స్వాములవారినికూడ అడుగగా "మి రెంతయో మేము ంతయే. మాకు డబ్బెక్కడిది?" అని . అంతట, "ఇక్కడ మీకేమియులేకుంటే బయలుదేరుడు, వెళ్ళి పోదాం" అని అమ అనగా ఒకపావలానిప్పించిరి.

వరెం త డబ్బి రో అను లె క్క వేసి, ఆ లెక్కల ప్రకార ూడునెల లు పంచు ఆ లెక చొప్పున అమ్మవా వా కడకుపోయి ఆహా ము సుకొ రి. రిగ డు

మాసములకు 24-3-37 న శ్రీ స్వాములవారును, సాధువులు కొందరును పోడూరు సభకుపోవుచు అమ్మకునువారే టిక్కెట్టు కొన, వారితో అమ్మ పోడూరు వెళ్ళిరి.

అమ ఆశ్రమంలోవున్న కాలములోనే ఒకనాడు భక్తులు కొందరు శ్రీ స్వాములవారికి హారతిచ్చుచుండిరి. మామూలు చొప్పున ఒకరూపాయి పళ్ళెములోపెట్టి వారికిచ్చిరి. వారే అమ్మకుకూడ హారతిచ్చిరి. దానిభావమేమొ తెలియక అమ్మ తనకావిషయము పట్టనట్లూరుకొనిరి. పిమ్మట పళ్ళెములోని రూపాయిని అమ్మకీయబోయిరి. అమ్మ దానినితాకలేక, 'ఛీ! ఛీ! మాకెందుకు రూపాయి' అనిరి. ఆ వచ్చినవారు, 'ఇక్కడ అట్లా రూపాయినిచ్చుట ఆచారము. శ్రీ స్వాములవారు పుచ్చుకొనుటలేదా? మీరును పుచ్చుకోవలె' ననిరి. అంతట అమ్మ, 'స్వాములవారు దరిద్రుడు. ఆయన తీసుకొనిన తీసికొనుగాక! మా క్కరలే'దనెను.

అచటనున్న వారిలో నొకరు యీ సంగతి స్వాములవారికి తెలిపిరి. వారు, 'అబ్బో! చిన్నమ్మ కాలాంతకురాలు' అనిరి. ఆ మాటతెలిసిన చిన్నమ, 'మేమింకను కాలాంతమును పొందలేదు. ఆ మాట మంచిదే. కాని మేము కాలములోనే యున్నాము' అ రి.

## ప్రసాదము

అమ్మ నోటనుండి 'ప్రసాదము' అను శబ్దమునకు సరియగు యర్థము (వివరము 8 వ పేజీలో చూడనగును) వెలువడినదాది అమ్మవద్ద నుండెడివారు తాము భోజనము

చేయుముందు ఆ పదార్థములను అమ్మకు ప్రసాదముగ చూపించుకొనటమో, లేదా తాము భుజించుముందు మొదటి ముద్ద అమ్మకిడి మిగత యాహారము ప్రసాదముగా చూపించుకొని భుజించటమో జరిగెడిది.

సాధారణముగ మనవారు భోజనములు చేయుముందు మొదటిముద్దను దేవునిముద్దని వేరుగానుంచి, చివరకు దానిని ఏ కాకికో లేదా మరిదేనికయినా వేయుదురు. పండుగ వగయిరా దినములలో మొత్తము పదార్థములు ఏ బొమ్మకో చూపించి తదుపరి స్వీకరించుట జరుగును.

ఏ యాచారము అమ్మవద్ద జరిగెడిదో దానినే పూర్వ కాలమునకూడ అప్పటి జ్ఞానుల ననుసరించెడివారు ఆ విధముగ ఆచరించి యుండవచ్చు. అదియే క్రమముగ ఆ వ్యక్తులు పోయినతదుపరి ఆ మమత పట్టలేక, ఆ వ్యక్తుల ఫోటోలు సేకరించి వాటికే చూపించుట, విషయము సరిగా తెలుసు కొనక ప్రథమ కబళమును వేరేజీవులకు పెట్టుట జరుగుచూ వచ్చుచున్నది. కాని కాకి వగైరా వుల కటుల యాహార మిడుటవలన తిరిగి ఆ జన్మలకు పోవలసి వచ్చునేమో!

## వినోబాతో

1942 లో వినోబాజీ వినయాశ్రమము వచ్చిరి. అపుడు అమ్మ అచటనే యుండిరి. 'రా' అను శబ్దమునకు లోబడి నడచెడి రోజులవి. అమ్మనడకంతయు విని, వినోబాజీ, 'ఎవరు రమ్మనినను వెళ్ళెదరా?' అని అమ్మనడిగిరి. అమ్మ, 'ఆ' అనిరి. దగ్గరనేయున్న సచ్చిదానందమూర్తి, వెంకటామయ

(కుమారులు)లను చూపించి, "వీరు రమ్మనినను వెళ్ళెదరా?" అని యడిగిరి.

"అందరిలాగా వీళ్ళు కానివాళ్ళయినపుడు, వీరురమ్మంటే వెళ్ళటానికి మాకేం" అనిరిఅమ్మ.

'ఆ!' అని ఎంతో ఆశ్చర్యపడిరి వినోబా.

సాధారణముగా లోకములో సాధువులు కర్తృత్వము ద్వారా భార్యాపిల్లలను, యిల్లూవాకిలి వదలి ఆశ్రమములో చేరుట కదు. అట్టివారు తమను వారి భార్యాపిల్లలు ఆహ్వానించినా తి గి వెళ్ళుటజరుగదు. అమ యిటుల కర్తృత్వము ద్వారా సంసారమును వదలి వచ్చి వారు కారు. ందరు సమానమే అయినపుడు ఎవరు రమ్మనినను వెళ్ళెదరు.

## ప్రకృతి శక్తులు లొంగుట

ఒకపర్యాయము వీరు క్రొత్త టనుంచి శే వచ్చుచుండిరి. వర్షాకాలము. ఆకా ము మేఘావృతమయి ది. కొద్ది నిముసములలోనే వర్షము ముంచివేయున యనుపట్లున్నది. శరీరముపై చినుకుపడి అమ్మ సహించలేరు. కా రేపల్లెలో సుఖవాసి నారయ్యగా ల్లు చే వలసి చోటు చేరగనే కుంభవృష్టి. ఈ విధముగా చాల పర్యాయములు రిగినది.

## బట్టల దొంగతనం

వినయాశ్రమమువద్ద నున్నపుడు కొందరిబట్టలు దొంగిలింపబడినవి. ఆ సందర్భమున "నాయనా! మామూలాన నీవు దొంగవయ్యావా? మా దగ్గరున్న యీ బట్టలు నిన్నుదొంగను

చేసినవా? మా మూలంగా చెడిపోయావా బాబూ! మేమున్న చోట యీ దొంగతనం తలెత్తి నిన్నిటుల పాడుజేసిందా? అని అమ్మ ఎంతగనో విలపించిరి.

ఈ సంగతి లోకానికేమి తెలుసు? ఇదివిని కొందరు, "అమ్మ జ్ఞానియగుటేమి? బట్టలు పోయినందుకు విలపించుటేమి? యని అనుకొనిరట.

## బ్రాహ్మణుల పూజ

ఒకపర్యాయము రేపల్లెలో బ్రాహ్మణులొకరు అమ్మను తమగృహంబున కాహ్వానించి, సాక్షాత్ భగవంతుడే వచ్చి కుర్చీయందు కూర్చుండబెట్టి, కేశవాయనమః మాధవాయనమ యని మంత్రములు చదువుచు పూజచేయ మొదలిడిరి. విచ్ మేమన, ఏ నామమంత్రము చదివిన అమ్మ ఆ రూపొందెడివారు. శివాయనమః యనగనే శివరూపమొందెడివారు. ఎదుటివారికి అటుల కనుపించకపోయినా, తామా రూపొంది నటులుగా అమ్మకే కనుపించెనట. అటులనే విష్ణాయనమః యనగనే విష్ణురూపము చెందెడివారు.

అన్నిరకముల ఎరుకలు మాలోయుండుటచే అటుల జరుగుటకలదని అమ్మ అనెడివారు.

## విశ్వరూపము

1945 ఫిబ్రవరి 12 నాటిసంగతి. అమ్మకు నీరసము వచ్చియున్నది. ఆ నీరసములో వారు లోకముల నన్నింటిని చూచుచు, 'యివిగో మణులు. మా శరీరమంతయును మణులే,

చూడండి. ఇందు డు మేమే. విష్ణువు మేమే. ఈశ్వరుడు, రుద్రుడు మేమే. యమధర్మరాజును కింకరులును మే మే, మృగము, పక్షి, పురుగు మున్నగు సర్వజీవులును మేమే" యనుచు వర్ణింపసాగిరి. మాయాశక్తి ప్రభావమును విశ్వరూప మును) అచటనున్న వారందరు ఆశ్చర్యముతో వినుటయేగాని ఎవరును చూడజాలరైరి. 'స్వర్గలోక మెట్లున్నదమ్మా?' యని ఒకరు ప్రశ్నింప, కొంతతడవాగి, 'కోటానుకోట్ల సూర్య కాంతి స్వర్గములోని ఒకొక మణికాంతికి సరిపోవునేమో! అట్టి ణులు స్వర్గలోకములో లెక్కకు మించి వున్నవి. ఇక ఆ స ర్గలోక మెంత దేదీప మానమైనదని చెప్పవలెను' అని తమ తామె మాట్లాడుకొను ఆ మణికాంతుల వైభవమును చూచి ఆనంద మనుభవించుచుండిరి. అపుడు వారిలోనిశక్తి, 'అనంతము, శాశ్వతము, దేదీప మానమునగు ప్రకాశ(పరమాత్మ)ముండగా అత్యల్పము, అనిత ము, తుచ్ఛము గు స్వ లోకానందమునకే ము రియుచున్నారా? అని యనుసరికి మాట్లాడజా క, శరీరమును కదల్పలేకయుండిరి.

మూడు దినములనంతరము ఆ స్వ క భోగము లనుభవించిన సత్య శాంత దయాది శక్తులకు గుణములకు శ్రాద్ధము చేయించమని లోనిశక్తి పలికిన ని అమ తెలుప, అచటనున్నవా అ ర చేసి అమ్మ కాహా మిడిరి. ఈ రోజు ఆహారము కొనుటల యిదివరకున్న హా ద్దు ల న్ని యు తొలగెను. విరోధులున్న వారిడు ఆహారమును తీసుకొనగూడ దనెడి నియమముకూడ సడలినది. మరునాడే తిరిగిహద్దులువచ్చి విరోధులున్న వారిడిన ఆహారమును తీసికొన జాలకపోయిరి.

విరోధులున్నవారు తమ విరోధులను ప్రేమతో పలుకరించి వచ్చి అమ్మ కాహారమిడ గలుగుచుండిరి. ఇటుల సుమారు 2½ వత్సరములు గడచినతదుపరి "విరోధులున్నవారు పెట్టిన, ఫలితము లేదంటివి. విరోధులులేనివారు పెట్టిన ఫలితముయొక్క భారమునీదేనా? ఎవరి విరోధభావమును వారే పోగొట్టుకొన వలయునుగాని, ఆ భారము నీదికాద"ని లోనిశక్తి తెలుప, తదాది విరోధులున్న వారిడు ఆహారమునుకూడ తీసుకొన మొదలిడిరి.

తెలుసుకొనుట - తెలియుట

ఒక పర్యాయము అమ్మ న అనుచరులతోపాటు బందరులో ఒక డాక్టరుగారింటికి వెళ్ళుట జరిగినది. ఆ డాక్టరు గారు అమ్మను, "అమ్మా! యీ బీడీలో యిన్ని దోషాలున్నా యని తెలుసు. కాని మానలేకుండా యున్నాను. కారణమేమ"ని అడిగిరి, "నాయనా! నువ్వు తెలుసుకున్నావుగా , కు తెలియ లేద"ని అమ్మ చెప్పిరి. తెలియుటన తెలుసు నుట కాదు. తెలియుటన నడచుటే.

పై జవాబు వినగనే అంతవరకు నిలబడియున్న అమ్మకు వెంటనే నమస్కరించి, యింటిలోనికి తీసుకొనిపోయి భార్యా పిల్లలచేకూడ నమస్కరింపజేయించి యథోచితరీతిని సత్క రించిరి.

శాంతి కుటీరము

అమ యిలువీడిన తదుపరి చాలమంది యథాశక్తిని వారి కాశ్రయమి రి. అందుము లు శ్రీ రేపల్లె బసవయ గారని చెప్పవచ్చు. వీరిది పోటు ఖరక ామము, రేప తాలూకా.

వీరు 1922 నుండి అమ్మ సాంగత్యమునకు వచ్చుచు 939 తరువాత అమ్మను యెడబాయక యుండిరి. వీరు, అమ్మ పోటుమెరకలో 1941) నున్నపుడు వారి సౌకర్యా ము అచట ఒ పాకయును, అవనిగడ్డ సమీపమునగల త్తపేటలో (1946) నున్నపుడు అచట ఒ పాకయును ఏర్పాటు చే యుండిరి. 95 లో అమ్మ అవనిగడ్డనుం రేపల్లెవద్ద న్న బావాజీత టకు వచ్చిరి. ఇంతకుపూర్వమిది పెద్దమ్మగారున్న నివాస. నము. అమ్మ యిచటను డగా శ్రీ బసవయ గారు ఈ తో సమీపముననే పేటేరు గ్రామమునకు సంబం చిన కొ తభూ ని కొని ందుల రెండు యిండను, పాకలను వేస . , మ్మ అనుచరు యిందుండె వారు. ఇదియే శా కుటిర గ వ వహా బడు చున్నది. అనేకులిచటి వచి , తమకువి యిన త లము డి, అమ్మ సేవించుచు వారిక ధలువిని వెళ్ళుచుండె వారు.

అమ్మ నెలలు శాంతి కుటీరము తూర్పువసారాలో నుండి, తదుపరి అచటచట తిరిగి, 1953 నుండి శాంతి కుటీరపు పడమటి సరిహద్దున సర్కారు లమునందు వేయబడినపాకలో నుండిరి. అంత్యదశవరకు అమ్మ యిచటనే కాలము గడపిరి.

## గొఱ్ఱె పెంటికలు

శాంతి కుటీరమున నుండు కాలమున ఒకనాటి సాయం కాలము అమ్మ అనుచరులతో కలసి మాటలాడుచు నొక డొంక వెంట వె చుండిరి. త్రోవలోనున్న గొఱ్ఱెలు (అమ్మ భాషలో అమాయ ప్రజ) మేత, మేయుచు అమ్మనిటుల అర్థించినవట—

"అమ్మా! ఎన్నాళ్ళు చూచినా మా జీవితం కోతకురాను, కోయటం- కోతకురాను, కోయటం- యిలాగే గడచిపోతోంది. మీ విస్తరిలోకివచ్చే కూరగాయల పాదుల్లో యీ పెంటికలు తీసుకుపోయి వేస్తే మేమేమైనా ఒకదారికి రాగలుగుతా మేమో!"

వెంటనే అమ్మ, వారి యనుచరులు అచటగల పెంటిక లన్నింటిని యేరి కూరగాయల పాదుల్లో, చెట్ల పాదులలో వేయించిరి.

## వస్తు జాగ్రత

వస్తు జాగ తలో వీరికి వీరేసాటి. తివస్తువును చాల జాగ్రత్తగా వాడెడివారు. ప్రతివస్తువు ప్రా గా కనుపించె ది అమ్మకు. ఏ వ వునయినా నిర్లక్ష్యము చేసి త్రోటి పా ని హింసించి నట్లుండెడిది. భోజనము చేయు పుడు అన్నపుమెతుకు వృథా పోనిచ్చెడివారు కారు. సమ్మ .. దొరికెడి నీటిని కూడ వృథాగా వాడెడివారుకారు. అన సరపు వాడుక వాడిన "మమ్మ నిర్లక్ష ము చేయుచేల" యని ఆ నీటిశక్తి యడు నట. ఏ వస్తువునయినా నిర్లక్ష్యపరచిన, వచ్చు మాయ అనగా కొరి త్తకర్మవచ్చి మనలను బాధించునని చె ండెడివారు.

## కండ్లకాటుక

తే. నేత్రవైద్యము చేయంగ నెలత యొకతె
చ్చి అమ్మను చూచియు వడిగ తాను
ంటినిండను కాటుక జంటచేసి
రెండు బొటనవ్రేళ్ళతో రుద్దె మెండుగాను.

తే. కండ్లురెండును అంతట కదలబారి
ఎఱ్ఱ దుత్తలట్లయెను ఎంతగానొ
పాపమా వృద్ధ ంతయు భయముచెంది
ఉండిపోయెను అంతట గుండెజారి.

తే. 'అమ్మ భయమేమి వలదం'చు అమ్మ పలికె
' ము దో ంబు దేమియు లేగయిందు
ను చేసి త్రయే యిప్పు టుల
అనుభవింపంగ జేసెదు నమ యిష్టుడు.'

తే. వృ మాతకు నీరీతి వేడ్క గలుగ
శా వచనంబు ల్కి యు సాగనంపె
అమ్మ చూపిన ఓర్పుకు అందఱచట
అ రంబున మునిగిరి, 'ఔర' యనుచు.

## పండిన తల్లి

అది 1956 వ సం. నవంబరునెల. సచ్చిదానందమూ ర్తి గారికి అక్టోబరులో ప్రారంభమైన టైఫాయిడ్ జ్వరము తగ్గు ముఖము పట్టినది. కాని ఆదేసమయమున దగ్గు ప్రారంభమై తీవ్రరూపము దా నది. రాత్రింబవళ్ళు మంచముపై కూర్చుండ వలసి వచ్చెడిది. మాత్రము త వా నను మనిషిని పూపిరాడ నీయకుండ గిలగిలాతన్నుకొనునట్లు చేసెడిదాదగ్గు. వారిపరిస్థితికి అమ్మ ఎంతయు తహతహలాడి, "ఆ గ్గు నీకు యి మాకు వచ్చిన బాగుండునురా సత ం!' అ య రి. ఆ దగ్గుకు డా రుగారు మందివ్వగా త ది.

అదేమిచిత్రమో – అమ్మమాట యదార్థముచేయుటకో లేక యీ దగునను భవించుట అ కు విధియో యనునట్లు– ఆ దినమునుం స దానందమూ గార్కి దగ్గుతగ్గి అమ్మకు రా నారంభించినది. తదాది అమ్మ అస తగా నుండసాగిరి. అటుల సుమారు వారముదినములు మా ము గడచినవి.

తదుపరి 4–12–19 6 వ తేదీకి దగ్గు తీవ్రరూపము దాల్చినది. దానితోపాటు కడుపుబ్బరము, గుండెదడ కూడ ప్రారంభమయినది సచ్చిదానందమూ ర్తిగారికివలెనే వీరికికూడ తలవాల్చగనే దగ్గు. ఇంక ఆ రాత్రి నిద్రపట్టు సూచనలు కన్పించుటలేదు. డా రుగా వద్దకు పోయి పరి తులు చె ఆ రాత్రి నిదరికుమాత ము మందిచ్చిరి. దానితోనాడు సు విద పోయి . 5 వ తేద డాక్టరుగారు వచ్చి పరీక్షించి గుండె నె ్రయని ని యించి మందిచ్చిరి. దగ్గు పారిరంభించినదాది

అమ్మ కొంచెము నీరసముగా నుం రి. అయినను వచ్చిపోయెడి వారికి యథాప్రకారము ఆధ్యాత్మిక విషయములు చెప్పుచునే యుండిరి. ఆరవ తేదీకూడ మందుతీసుకొనిరి.

ఇంక మరునాడు. 7-12-1956 శుక్రవా ము. మా శిర శుద్ధ పంచమి. 'మావూరు (పరమాత్మ) ఎపుడు చేరు కుంటామో' అని తహతహలాడు వ్యక్తి ఆ దినము సమీా పించినదిగాన ఆనాడు అమ్మకు, వారి యనుచరులకు, పరిచితు లకు పర్వదినము. అట్లని క్షణకాలము కి తమువరకు గటిగా వూహించినవారు లేరు. కాని అమ్మకు మాత ము అట్టి సూచ నలు కనుపించు చున్నవా యనునటుల వారి మాటలనుబట్టి తెలియుచున్నది.

నిద్రలేచిన తదుపరి శ్రీరామమ తో, 'శ్రీ రాం! మీా యింట్లోకి ఒకశవాన్ని చేతుల్తోపట్టి సుకువచ్చినట్లు కల వచ్చిందే రాత్రి మాకు!' అని య . ని ్యము ప్పుచుండెడి కలల ంటిదే యిది, అ అనుకొని గాని, భవిష్యత్ సూచనని ఎవరును వూహించ రై .

ఉదయము ఏడుగ ట ుకు మందుకై ఒ రు బయలుదేర బోవ, 'మా మందూవద్దు, ఏమీావద్దు. మట్టిలో కలిసిపోయే యీా శరీరాని మందు దేని ?' అని యను రి వారూరకొనిరి.

అమ్మ ద రుంటున్న ఒకామె పాలడుగు మ గమ . మోపరు ఆనా కార్యాంత ముపై స్వగ్రామము బయ దేరనుండ, 'మంగమా ! అ ను ఏదోయొకటి చేసిపోక, అపుడే వెళ్తున్నావేమే?' అనిరి.

చాకలి వెంకాంతో, 'వెంకాం! స్వాములవారు (తత్వానంద స్వామి) తే నీకు చాలాగుడ్డలు దొరికాయి కామాను. ఈ మ్మదిది ఒక లికకూడ యివ్వరు' అన్నారు అమ్మ.

దగ్గరలోనున్న సాధిం రత్తమ్మగారితో, 'రత్తమ్మా! పెద్దమ్మ ఆరాధన రాబో ంది కాబోలు! మేముపోతే ఆ ఆరాధనకేమీ యిబ్బందిలేదుగదా!' అని అడిగిరి.

సుఖవాసి తురీయం నారయ గారి కొమా ర్తె) అను నామె నూనె తెచ్చి, 'అమ్మా కా నూనె రాయనా?' అన 'ఊ! రాయి. ఇంకెన్నాళ్ళు రాస్తా లే! ఇవాళ ఒకరోజేగా!' అని చెప్పిరి.

ఈ మాటలలోని సూచన అచటివారికి కొంతవర ర్థమయినను, 'అమ్మ తమనుండి దూరమగునా! అది యిప్పుడే సంభవమా!' అనునది పై సూచనను దృఢపరచ లేకపోయినది.

లోగడ అమ్మ చెప్పుచూవుండెడి మాటలను —వినేది. చూచేది, మాట్లాడేది పోవాలి. అపుడు దొంతుల కు వలెనే సంగరహితావస్థ వస్తుంది. అదిమీకు ఎంతో బాగుంటుంది. మీరుకూడ బాగుపడతారు) బట్టి, యిప్పటి నీరసమును బట్టి, లోగడ నీరసములలో వలెనే యిప్పుడుకూడ (విను, కను, మాట్లాడు) వృత్తిరహితమై అమ్మ అతీతావ కు చేరునేమో, అ- మహత్తరదశను కనెడిభాగ్యము గ్గునేమో యని అందరు ఆశపడిరి.

ఆదేరోజు (7-12-1956) మధ్యాహ్నం 2 గంటలవేళ కాపూరు వినయాశ్రమమునుండి గొల్లపూడి సీతారామశాస్త్రి

గారి కుమారులు సుబ్బయ్య శాస్త్రిగారు (ఆయుర్వేదవైద్యులు ఏదియోపనిపై రేపల్లెవెళ్ళుచు అమ్మను దర్శించుటకు వచ్చిరి. నీరసముగ నున్నను వారితో అమ్మ చాలసేపు ఆధ్యాత్మిక విషయములు ముచ్చటించిరి. వీరు అమ్మను లోగడ ఎరిగి యున్నవారే. మాటల సందర్భములో అమ్మ అనారోగ్య పరిస్థితులు వగైరా తెలుసుకొని, 'అమ్మా! మీ వద్దకు వచ్చు వారందరు పండో ఫలమో యిచ్చి మిము లను పోషించుకొను చున్నారు. మేముకూడ మా శక్త్యానుసారము తగు (ఆయుర్వేద) మందులిచ్చి అమ్మను కాపాడుకుంటామ'ని పలికిరి.

అపుడు అమ్మ, 'నాయనా! నీవుచెపి ంది బాగానేవుంది. కాని అసలు మేము మందేవద్దన్నాము. అ తగా అవసరమైతే యిప్పటివరకు మందిస్తున్న డాక్టరుగారిని కాదని, నీవద్ద తీసు కోవటం మంచిదికాదు గదా! వారి మందువల్లకూడ ఫలిత లేకపోతే అపుడు నీవద్ద మందుతీసుకోవచ్చు. అవునా బాబూ! అని చెప్పిరి.

అప్పటి సాయంకాలము 5 గంటలయినది. ప్రొద్దు గుంకువేళ. ంటికి వెళ వలెననెడి తలంపుతో, 'సరే మంచిదే' యని సుబ్బయ్య శాస్త్రిగారు లేచి అమ్మకు నమస్కరించి ప్రక్కనే రోడ్డుపైనున్న మఠాన్నెక్కుటకై బయలుదేరిరి. అమ్మకూడ ఒకటికి వెళ్ళవలసిన అవసరము లిగియో లేక మరేలకో లేచి . కాని పూర్తిగాలేచి నిలబడకమునుపే, తూలి పడిపోయిన హానివలె, గభాలున తాము టివరకు కూర్చుని యున్న చాపపైననే కూర్చొనబడి ముందుకొరిగిరి. గత అయి దారు దినములుగా నీరసముగా నుండుటచే కళ్ళుతిరిగి పడిపోయి

లేమో యని కొందరు, యిదేదియో నీరసము, యేదైనా మార్పువచ్చునేమోయని కొందరు, ఉదయమునుంచి పరి తులు చూచుచుండుటచే, 'యికేమున్నది, అమ్మమనకు దూ మయి నదా!' యనికొందరు వివిధరకముల తలపోసిరి. దగ్గరనే ఎదుట నున్న సచ్చిదానందమూర్తి వగైరాలు బోర్లపడియున్న ముఖ మును ప్రక్కకుత్రిప్పి, వెంటనే నీళ్ళు తెప్పించి నోటిలోపోసిరి. కాని అవి లోపలికి పోయినటుల లేదు. అమ్మకడనుండి కొద్ది అడుగులు మాత్రమే వేసిన ఆ ఆయుర్వేదవైద్యులు, వెంటనే వెనుతిరిగివచ్చి నాడిపరీక్షించి చప్పరించిరి.

ముఖవైఖరి మారినది. నోరు తెరచియుండుటచే నాలుక రంగుకూడ మారుట స్పష్టముగా కానుపించినది. కండ్లచూపు కూడ అదోకవిధముగా నుండెను. నేలకొరిగిన కొద్దిక్షణములకే అమ్మనోటనుండి వెంట వెంటగా రెండుదఫాలు ఎగశ్వాస వచ్చెను. అంతటితోసరి.

ఇక అప్పుడు అందరిలోను యీ క్షణమునుండి అమ్మ మనకు భౌతికముగా దూరమయిన దనెడి అంతిమ నిర్ణయము జరిగినది.

తంతి సౌకర్యముకలిగి దూరప్రాంతములందున్న భక్తుల కప్పటి కప్పుడే యీ వార్త తంతులద్వారా అందజేయబడినది. మిగతవారికి, వెంటనే వార్తలు పంపుటకెట్టి సౌకర్యములులేక పోవుటచే, మరుసటి ఉదయముననే వీలగు మార్గములద్వారా అమ్మ యనుచరులందరకు యీ వార్త అందజేయబడినది.

అమ్మ భౌతికకాయమును భక్తులు రాత్రి సుమారు గంటలవేళ యింటిలోనికి తీసుకొనిపోయి, తుది దర్శనమునకై

యే తెంచు ప్రజల సౌకర్యా ము ఒక యెత్తగు నమున కూర్చుండబెట్టి తగు యేర్పాట్లు గావించిరి.

నైతికముగా దూరమైన అమ్మకై విలపించెడి వారి గాంచి సచ్చిదానందమూర్తిగారు, 'లోకములో వారి లె యిట్లు అమ్మకై విలపించుట మంచిదికాదు. అమ్మ సామాన్య వ్యక్తి కాదుగదా! మహత్తరస్థితి నొందిన అమ్మనుగురించి మనము సంతోషముగ నుండవలె గాని, దుఃఖించగూడదని అందరిని యూరడించిరి. ఆ రాత్రి వారందరికి ధైర్యముచెప్పి అందరు ఆహారము తీసుకొనునట్లుజేసిరి.

ఆ రోజు (7-12-1956) ఉదయమున, 'మాకు మట్టిగడ్డ కాని, ఒకటిగానే కన్పిస్తోంది. మే మిప్పుడు కానీ తా గలం' అనెడి అమ్మ మాటనుబట్టి అంత్యకాలములో అమ్మ అతీతావస్థకు చేరుకొనెననియే చెప్పవచ్చు.

8-12-1956 తెల్లవారినదాది వందలాదిప్రజలు అమ్మ తుది దర నమునకై పరు డి రా సాగిరి. 1, 2 దినములవరకు శాంతిపుటరము తీ నమయినది.

దవ్వులనుంచి వ వా కవకా ము కలిగించునిమిత్తము వుండగలిగినంత కా ము ఆ కాయము నటులనే భక్తులు యుంచదలచిరి. 8 వ తేదీ పగలుకూడ గడచినది. ఇక ఆ రాత్రి అమ్మ భౌతికకాయము నిలువయుండునటుల కాన్పించలేదు. ఏమిచేయదలచినను ఆ రాత్రియే. మిచేయవలె ననునది పెద్ద సమస్యకాలేదు. ఏలనన, అంతకుముందే అమ్మ 'మేము పోతే మమ్మల్ని ఏ గోతిలోనన్నా పెట్టండి' అని చెప్పియుండిరి.

వారిమాటలను కాదనుటెట్లు? ఆ రెండుయిండ్ల మధ్యభాగము ననే పెద్ద గోయితీసిరి. అది రాత్రి 2 గంటలవేళ. అందరును తుది దర్శనము చేసుకొని అమ్మ భౌతిక శరీరమును నగ్నముగా ఆ గోతియందు పూడ్చిపెట్టుటతో తదుపరి దర్శింప వచ్చిన భక్తుల కా యవకాశముకూడ లేకపోయెను.

ఇక మార్గమేది?

'అయ్యో! అమ్మను కడసారియైనను చూడలేక పోతిమే!' యని కొందరు, 'అమ్మ వుండగా, అమ్మవద్దకు రాలేకపోతిమే!' యని కొందరు, "అసలు అమ్మను ఒకసారియైనను చూచు భాగ్యము లభించలేదే!" యని కొందరు, "యిక మా ̄ ̄మేది?" యని కొందరు, యిట్లు పలువురు పరిపరివిధముల ప తపించ సాగి . కాని, "మేము పోయినాక మాశక్తి ఎచ్చటో ఒక చోటవుంటుంది. లేదా ప్రయత్నించి వెదకితే మాలాంటివారు లోకంలో వుండకపోరు. వారిని వెదకి సంపాదించుకొనండి లేదా యీ సంఘాన్నైనా అంటిపెట్టుకొని యుండండి" అనెడి అమ్మ వాక్యములను గుర్తుంచుకొని నడచిన పైవిధముగ పరితపించ పనిలేదేమో!

'అమ్మ లేదుగదా! ఇకనేమిటి కర్తవ్యం?' అనుప్రశ్న చాలమందియందుదయించకపోలేదు. కాని, "అమ్మ ఎచ్చటికి పోలేదు, ఇచ్చటే వున్నారు. ఈ సంఘాన్ని అనుసరించండి" అని శ్రీ సచ్చిదానందమూర్తిగారు ధైర్యము చెప్పుచుండిరి.

వీరు చిన్నతనమునుండియు ఋజువర్తనము గలవారని మొదటనే పేర్కొంటిమి. అమ్మకూడ అపుడపుడు "వాడి

నడకే వేరు. ఎప్పుడుకూడ తప్పుకు దొరికినట్లు కనుపించడ”ని అనుచుండెడివారు. వీరుకూడ తమకు 1944 లోనే పరమాత్మ దర్శనమయినదని చెప్పుచుండిరి. వీ నడక చూచిన అటులనే కర్తృత్వ రహితులై వ్యవహరించుచున్నటుల కనుపించుచున్నది. అమ్మ వున్న కాలములోనే వీరుకూడ ఆత్మశక్తి కలవారనెడి విశ్వాసముతో కొంతమంది వీరిననుసరించెడివారు. అమ్మకూడ “సత్యాన్ని వదలిపెట్టకండి” అని అపుడపుడు చెప్పెడివారు. ఇపుడు అమ్మ అనుచరులు వీరిని, 9 సం॥రముల క్రితమే ఉద్యోగమునకు రాజీనామాయిచ్చి, తమ వితమును అమ్మ సేవలోగడపి, ప్రస్తుతము కర్తృత్వ రహితులై యున్నటుల కాన్పించు శ్రీ మునీశ్వరుడుగారిని అనుసరించుచుండిరి.



# ఎవరో!

సీ. ఇల్లు వాకిలి కాదు పిల్లజెల్లయు కాదు
ఏవియు కాదన్న దేవి ఎవరో!
ధనమన్న గజ గజ వణకుపుట్టియు వేగ
కై న కేకిడు అవ్వ ఎవరో!
కట్టుచుండె బట్ట కాలదన్నియు అభి
మానంబు చంపిన మాత ఎవరో!
తలనున్న వెంట్రుకల్ తొలగించియును బోడి
అవతార మెత్తించు అమ్మ ఎవరో!
ఆరోగ్యమును కోరి ఆచరించెడు నిత
స్నానంబు మాన్పిన శక్తి ఎ రో!
మెత్తనైన పరుపు బొత్తిగా తొలగించి
చాపను చూపిన సాధ్వి ఎవరో!
తలక్రింద బట్టలు తన్నుకపోయి తా
తలి, క్రిందు చేసిన తల్లి ఎవరో!

తే. విషయ వాసనలందుండి వేరుచేసి
సర్వవృత్తుల ఖండించి చక్కగాను
తరలి పోవుచునుండు నా తల్లి ఎవరో!
భక్తితో నామె నేగొల్తు శక్తి కొలది.

వమ్మా

అమ్మా! మా చిన్నమా
పరిపూర్ణ పవిత్రపు ఆత్మశక్తి

1. వేదాంత శిరోమణి వమ్మా
మా అందరి పట్టుగొమ్మా!
వేలలేని అమూల్య పదాలు పల్కెడి
జ్ఞానుల రాణి వమ్మా!

2. ఆత్మ జ్ఞాన వివేకీ
అజ్ఞానము నంతయు బా
పరమాత్మ మహత్వపు త్వము జూపిన॥

3. నీ నోటను వ న మాటా
యీ మానవ టికి శాటా
లోటులు కోటులు కూ న బాటలు
కూడ వ ంచును పలికిన అమ్మా!

## 2

వందనం వందనం శ్రీ చిన్నమ్మా!

1. భూతల మందున బుద్ధదే నిలాగ
అవతరించిన యట్టి ఆత్మ క్తీ!
యీతరము వారికి ఎన్న లు
చేకూర్చి యున్నట్టి చిన్మ క్తీ!

2. వక్ర మార్గమునందు వదలక పోయెడి
నరులకు సరియగు మార్గముచూపి!
వెలలేని కీర్తిని విరివిగ పొందిన
మాతరో నీకిదె మాదగు భక్తి!

3. పూజలు గీజలు పుణ్యామీయవని
బోధించి యున్నట్టి భవ్యమూర్తీ!
మీ మీద యున్నట్టి నిండుభక్తిచేత
చేయుచుంటి మిద్ది చిన్న తల్లి! వం॥

# 3

సీ. పేరుపొందినయట్టి పెద్ద గురులను
చేరి శుశ్రూషలు చేసి చేసి
మంత్రోపదేశంబు మానక గ్రహియించి
జపమాలతో నద్ది జపము చేసి
తలనున్న వెంట్రుకల్ తొలగించి పూర్తిగా
తలపులే లేవని తలచి మదిని
కాషాయ వస్త్రాల గంతలు ధరియించి
సాధువ నంచును సాటిచెప్పి

తే. కడకు ఆవంత శాంతియు గానలేక
అమ్మరో నీవు వచియించు అమృతంపు
పలుకులను ఆలకించియు పరమతృప్తి
పొందియున్నట్టి — భక్త బృందమిపుడు
అమ్మలేనట్టి బిడ్డల మ నేడు.

## 4

సీ. ఉపవాస వ్రతముల నపరిమితంబుగా
గురువుచెప్పి యట్లు జరిపి జరిపి
వేదాంతగ్రంథముల్ విసుగన్నదియులేక
పఠియించి పఠియించి పవలు రేయి
అఘపంక క్షాళన మగునంచునెంచియు
నదులందు స్నానము నమ్మిచేసి
రామకృష్ణాయంచు రాత్రియుం బవలును,
గొంతు బొంగురుబోవ గోలచేసి

తే. ఇన్నిచేసియు లాభంబు సున్నయనుచు
మనమునందున గ్రహియించి మాతనిన్ను
చేరి సేవించ మేలని చిత్తమందు
నమ్మియున్నట్టి మాకిక అమ్మ! లేవ!

## 5

సీ. ఇల్లువాకిలి వీడి పిల్లజెల్లను వీడి
తల్లి నీచెంతకు తరలివచ్చి
అన్నదమ్ముల వీడి అనుగుభార్యను వీడి
అమ్మ నీచెంతకు అరుగుదెంచి
ఆస్తిపాస్తుల మీద ఆశను తెగగోసి
నీవె మంనిధియని నిన్నుజేరి
వైవాహికంబది వద్దని వచియించి
నీ పాదసేవమే నెరపనెంచి

తే. ఇచ్చటికి వచ్చియున్నట్టి యింతమంది
నేమిచేయంగ విడిచితో ఎరుకరాదు
ఏది దిక్కిక మాకిక మీద యిచట
అమ్మ! చిన్నమ్మ! మాగుండె లావటిల్లె.

## 6

సీ. ఏతల్లి ముఖపద్మ మింపార వీక్షింప
ఏ తెంచవలయునో ఎరుకరాదు
ఏతల్లి మాటల నింపార వినుటకు
ఏ తెంచవలయునో ఎరుకరాదు
ఏతల్లి పదముల కెరగి దండము పెట్ట
ఏ తెంచవలయునో ఎరుకరాదు
ఏతల్లి సేవకై యిచ్చటి కికమీద
ఏ తెంచవలయునో ఎరుకరాదు

తే. శూన్యమైయున్న పాకను చూచినపుడు
కట్టెలాగున నిలబడి అట్టె అచట
బావురని యేడ్చు భక్తుల బాధనిచట
చెప్పలేనమ్మ చిన్నమ ! సెలవునిమ్మ!

# ఎవరిది వారిదే

సీ. ఒకచోట నొ మాట ఒకడు విన్నఫలంబు
అనుభవించును వాడె, అన్యుడెట్లు!
ఒక పండులోనుండు ప్రకటమౌ రుచులెల్ల
తినువానిదే యంచు తెలిసికొనుము
ఒక చిత్రశాలలో చకచకల్ కనుసొం
చూచువానిదె గాక చూచునెవడు?
గాఢ నిద్రలోగ   కను ని సౌఖ్య బు
నిద్రించువా   నిజము దలప

తే. అన్నిఫలములు వారినే యంటినట్లు
మనలకోపాన ఒరులన్న మాటకూడ
అన్నవారిదె గాక యెట్లౌను మనకు
ఇంతమాత్రంబు తెలియదా, చింతజేయ.

* * *

తే. జ్ఞాన భిక్షకై వచ్చు మానవాళి
మృదుమధుర భాషణంబుల మోదమలర
భక్తి మార్గంబు బోధించి భవ్యమైన
చిత్త శుద్ధుల జేతువు చిన్న అమ్మ!

# ఏది గొప్ప?

సీ. దేహమే ఘనమని తెలుపుదమటయన్న
శ్వాస నిశ్వాసల సాగునద్ది
శ్వాస నిశ్వాసలు శాశ్వతమందువా
బ్రతుకు జీవుని జేరి సతతమవ్వి
అంతటి జీవుండు నదియేమి చిత్రమో
ప్రా బ్ధ కర్మకు బద్ధుడగును
ప్రారబ్ధ కర్మయే ప్రబలమైన దటన్న
అహము చేతిలోనద్ది ఆడుచుండు
ఆంతటి అహమును, సుంతచేయగలేక
నీతికి ద్ధమై నిలచియుండు
అట్టి నైతికశ అదియేమి మాయయో
వైరాగ్య దృష్టిచే వైదొలంగు

తే. అట్టి వైరాగ్యశక్తియు ఆత దరిని
అణగియుండును నితంబు అణువు పగిది
గొప్పదగు నాత్మకూడను తప్పకికను
భక్తజనముల పాలిటి భాగ్యమగును.